ముళ్ళపూడి వెంకటరమణ

సాహితీ సర్వస్వం - 3

బాలరమణీయం

# బుడుగు

సంపాదకుడు : ఎమ్బీయస్ ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

MULLAPUDI VENKATA RAMANA SAAHITHEE SARVASWAM - 3
**BALARAMANEEYAM -BUDUGU** - EDITOR : M.B.S. PRASAD

| | |
|---|---|
| ప్రచురణ నెం | : 2350/2320 2R |
| ప్రతులు | : 2000 |
| వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ | : జూన్, 2001 |
| వి.పి.హెచ్. ద్వితీయ ముద్రణ | : జూలై, 2002 |
| వి.పి.హెచ్. తృతీయ ముద్రణ | : సెప్టెంబర్, 2003 |
| వి.పి.హెచ్. చతుర్థ ముద్రణ | : అక్టోబర్, 2004 |
| వి.పి.హెచ్. పంచమ ముద్రణ | : ఆగష్టు, 2005 |
| ముఖపత్రం, లోపలి బొమ్మలు | : బాపు |



**వెల: రూ.80-00**

**విదేశాల్లో వెల : $ 8**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
అబిడ్స్, హైదరాబాదు-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్/సుల్తాన్‌బజార్) - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ,
గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.



అక్షరాల కూర్పు : **ట్వంటీఫస్ట్ సెంచరీ,** దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్. ఫోన్: 24066986
ముద్రణ : **శ్రీకళాంజలి గ్రాఫిక్స్,** హైదరాబాదు-29. ఫోన్: 23224831/55599831



# బుక్స్, బుక్స్ & బుక్స్

"బాపూ! నువ్వు వారపత్రికలో కథలకి బొమ్మలు వేసినపుడు గోడ దగ్గర బుక్ రాక్ వేసి దాంట్లో పుస్తకాలు పెట్టు - గోడ లేకపోతే గది మధ్య టీపాయి మీదనో మంచం మీదనో కుర్చీ మీదనో సగం చదువుతూ బోర్లించినట్టు పుస్తకాలు బొమ్మలు ఉంచు - సినిమా తీస్తే వీలైనన్ని చోట్ల పుస్తకాలు చూపించు... దీన్ని హిడెన్ సెల్ అంటారు. బొమ్మ చూసే వాడికి తెలియకుండానే పుస్తకాల మీద ధ్యాస పెరుగుతుంది... ఎరువడగడం, కొనడం, చదవడం పెరుగుతాయి... క్రమంగా బుర్రలు తెరుచుకుంటాయి... సమాజానికి మేలు జరుగుతుంది..."

ఈ గొప్ప మాటలు మాకు చెప్పిన ఒక గొప్ప మనిషి శ్రీ ఆర్థర్ ఐసెన్‌బర్గ్. అమెరికా - ఫోర్డ్ ఫౌండేషన్ వారు మద్రాసులో నెలకొల్పిన ధార్మిక సంస్థ ఎస్. ఎల్. బి. టి. (సదరన్ లాంగ్వేజెస్ బుక్ ట్రస్ట్) కి ఆయన కొన్నేళ్ళు డైరెక్టరుగా పని చేశారు. ఈ నాలుగు భాషలలో మంచి పుస్తకాలు అచ్చు వేయించడం. చక్కని మార్గాలలో వాటిని అమ్మించడం - అంతకు మించి - అందరి చేతా 'చదివించడం' - ఆయన లక్ష్యం.

ఈ మహోద్యమంలో - తెలుగులో ఎం. శేషాచలం కంపెనీ వారి ద్వారా - ఎం.ఎన్. రావు గారి ఎమెస్కో "ఇంటింటి గ్రంథాలయం" ఒక ప్రముఖ భాగం. రూపాయికి ఒక పుస్తకం చొప్పున నెలకు నాలుగు పుస్తకాలు వేశారు. ఊరూరా లక్షలాదిగా "ఇంటింటా" గ్రంథాలయాలు వెలిశాయి - వెల్లివిరిశాయి - అదంతా ఐసెన్‌బర్గ్ కృషి ఫలితమే...

అందులో భాగంగానే బాపూ రమణలను ఆయన ఆదరించారు - ప్రోత్సహించారు - బాపుని దేశమంతా తిప్పి వేలకొద్దీ ఫోటోలు తీయించారు - బొమ్మలు వేయించారు. నా చేత - నన్ను దంచి సాధించి "నవ్వితే నవ్వండి" జోక్స్ బుక్ రాయించి, ట్రస్టు ద్వారా అచ్చు వేయించారు. అది పది సార్లు పునర్ముద్రణ పొందింది.

ఆయన మాకు కొన్నివేల జోక్సు చెప్పారు - నవ్వించారు. అన్ని విధాలుగా ఆయన కన్న చిన్న వాళ్ళమైనా మమ్మల్ని బాయ్ ఫ్రెండ్స్ గానే కాక మంచి మిత్రులుగా ఆదరించారు. ఆయనతో గడిపిన ఐదారేళ్ళు మాకు మరువరాని మైలురాళ్ళు

ఆయన ఇప్పుడు ఇజ్రాయిల్ జెరూసలెంలో ఉన్నారు. పెరిగే వయసు వల్ల ఆయన ఉద్యోగం అయిపోయినా ఉద్యమం మాత్రం ఆపలేదు. సాగుతూనే వుంది. అక్కడి నించి కూడా పత్రికలు, పుస్తకాలూ పంపుతూనే వున్నారు.

ఆయన మాకిచ్చిన కొండంత వరాలకు కృతజ్ఞతతో, ప్రేమతో, గౌరవంతో
బాపూ రమణీయమైన 'బుడుగు' ను గోరంత పత్రిగా సమర్పిస్తున్నాను.

# బుడుగు వెంకటరమణ...

హాస్యమందున అఋణ
అందెవేసిన కరుణ
బుడుగు వెంకటరమణ
ఓ కూనలమ్మా - ఆరుద్ర

ముళ్లపూడి వెంకటరమణ సృష్టించిన పాత్రలన్నిటిలోనూ (అప్పారావు, రెండు జెళ్ల సీత, రాధ–గోపాలం, తీ.తా., కంట్రాక్టర్..) ప్రసిద్ధి చెందినది బుడుగు. పైన చెప్పినట్లు ముళ్లపూడి – బుడుగు వెంకటరమణే. ఇంతటి మహత్తరమైన పాత్ర సృష్టించిన రమణ "బుడుగు" ఆంధ్రపత్రిక వారపత్రికలో సీరియల్‌గా వచ్చే రోజుల్లో (నవంబరు 56 నుండి ఏప్రిల్ 57) రచయితగా తన పేరు వేసుకోలేదు. చివరికి అందరి బలవంతం వల్ల "ఇది రాసి పెట్టినవాడు ఫలానా, బొమ్మలు వేసిపెట్టినవాడు ఫలానా" అని వేశారు, అదీ ఆఖరి సంచికలో.

బొమ్మలు వేసిపెట్టడమే కాదు – 'బుడుగు' సృష్టిలో బాపు కూడా పెద్ద పాత్ర వహించారు. 1962 నుండి బుడుగు కార్టూన్ స్ట్రిప్స్ (బుడుగు, ఇడుగిడుగో బుడుగు) రన్ చేయటంలోనే కాదు, 'బుడుగు' పుస్తకం కొత్త ఎడిషన్ వచ్చినప్పుడల్లా 'బుడుగు'ని రకరకాలుగా (వామనుడిలా, గోపాలకృష్ణుడిలా, గిరీశంలా...) present చేస్తూ నిత్యనూతనంగా ఉంచడంలోనే కాదు, రమణ కొత్త ఐడియా గురించి మథనపడుతున్నప్పుడు ముందు బొమ్మ వేసిచ్చి ఇన్‌స్పిరేషన్ ఇచ్చినది బాపూయే. అందుకే బాపూ వివిధకాలాలలో వేసిన బొమ్మలు సేకరించి యిచ్చిన అనంతపురం వాస్తవ్యులు డా॥ విజయమోహన్‌రెడ్డికి కృతజ్ఞతలు.

తమాషా ఏమిటంటే, బుడుగు అనేది రమణ చిన్నప్పటి ముద్దుపేరు. (వాళ్ల అక్కగారిని బుడిగి అని పిల్చేవారు.) జనంలోకి వచ్చి అర్ధశతాబ్ది కావస్తున్నా బుడుగు పాప్యులారిటీ ఏమాత్రం తగ్గలేదనడానికి తాజా నిదర్శనం – ముళ్లపూడి సాహితీసర్వస్వంలో మొదటిసంపుటం కథారమణీయం–1 వెలువడగానే అందరూ అడిగినది 'బుడుగు' ఎప్పుడు వస్తోందనే! ('రమణ సాహిత్యం అంతా ఒక ఎత్తు. బుడుగు ఒక్కటి రెండెత్తులు' – ఎమ్వీయల్) అందుకే ఏడవసంపుటంగా రావలసిన బుడుగు రెండో అడుగులోనే మూడోసంపుటంగా వచ్చేస్తున్నాడు. ఇలాటి సందర్భాలలో మొట్టమొదటిసారి ఆంధ్రపత్రిక వీక్లీలో సీరియల్‌గా వచ్చినప్పుడు పెట్టినపేరు గుర్తుకు వస్తుంది. అప్పుడు ఈ రచన పేరు – "బుడుగు, చిచ్చులపిడుగు"

బుడుగు రచనకు ఇన్‌స్పిరేషన్ 'డెనిస్ ది మెనేస్' అంటారు. అదే ధోరణిలో బుడుగు గురించిన విశేషణం చేర్చి ఉండవచ్చు. డెనిస్ తన విశేషణాన్ని ఇంకా కొనసాగించుకు రావలసివచ్చినా బుడుగుకి ఆ అవసరం లేకపోయింది. బుడుగు స్వరూపస్వభావాలు, వాడి భాష, వాడి ఆలోచనా పద్ధతి తెలుగునాట నాటుకుపోయాయి. ఆలోచించి చూస్తే బుడుగు విస్తృతి డెనిస్ కంటె ఎక్కువ. మిస్టర్ విల్సన్, మార్గరెట్, జో – లావుపాటి పక్కింటి పిన్నిగారు ముగుడు, సీ.గాన పెసూనాంబ (మార్గరెట్‌కున్న అహంభావం ఈ అమ్మాయికి లేదు పాపం), గుండుదీక్షితులు అనుకున్నా బుడుగు పరివారం ఇంకా పెద్దది. భారతీయ సమష్టికుటుంబ వ్యవస్థ లాభాలు బుడుగు పూర్తిగా పొందాడు. కాబట్టి డెనిస్‌కి లేని బామ్మ, బాబాయి బుడుగుకి ఉన్నారు. బాబాయి ద్వారా రొమాంటిక్ వ్యవహారాలపై కూడా బుడుగు అభిప్రాయాలు తెలిశాయి. అలాగే బామ్మ ద్వారా సంప్రదాయం, సంస్కృతి, దేవుడు, అభిమానం, ఆపేక్ష – లాటి విషయాలపై బుడుగు వ్యాఖ్యానించగలిగేడు.

డెనిస్ జీవితలక్ష్యం కౌబాయ్ అయితే, తెలుగువాతావరణంలో పుట్టి పెరిగిన బుడుగు లక్ష్యం జట్కా తోలడం, ఇంజన్‌డ్రైవర్ కావడం. అలాగే అప్పట్లో సాహిత్యరంగాన్ని ఏలుతున్న అపరాధపరిశోధక నవలల్లోని డిటెక్టివ్‌వాళ్లు, నవ్వే పాపాయిని ఏడవమని బతిమాలే తెలుగు సినిమారంగంలో ఉండే అసహజత్వం – ఏవీ బుడుగు దృష్టిని దాటిపోలేదు. అప్పటి పిల్లలపాలిట గండం అయిన పదమూడో ఎక్కం గోపీకి చెప్పిన కథలో కనబడుతుంది.

జగద్విఖ్యాతమైన 'టామ్‌సాయర్'ని సృష్టించిన మార్క్ ట్వేన్ ఒకసారి చెప్పాడు – తన అనుభవాలు, స్నేహితుల అనుభవాలు కలిపి టామ్‌సాయర్‌ని తయారు చేశాయని. బుడుగు రాయడానికి ఇన్‌స్పిరేషన్ తన బాల్యం నుండి తీసుకున్నానని రమణ ఆంధ్రజ్యోతి ఇంటర్వ్యూలో అన్నారు. బాపు మేనల్లుడు, దరిమిలా అల్లుడు అయిన రంగారావు చేసిన అల్లరి కూడా పాత్ర సృష్టికి దోహదపడిందని నండూరి రామమోహన్‌రావుగారు ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

టామ్‌సాయర్‌చేత పిల్లలభాషే మాట్లాడించాడు మార్క్ ట్వేన్. హకల్ బెరీఫిన్, జిమ్‌ల చేత కూడా వారివారి భాషలను మాట్లాడించాడు. బుడుగు అసలు, సిసలు తెలుగుపాత్ర కాబట్టి తన భావాలను తెలుగులో, తను తయారుచేసుకున్న పదజాలంతో వ్యక్తీకరించాడు. ఆ భాషలో మాట్లాడడం, రాయడం ఫ్యాషన్ అయ్యేటంత (పోలిక చెప్పాలంటే బాపులా వంకరటింకరగా అక్షరాలు రాస్తేనే అందం అనుకునేట్లు) గొప్పగా ఆ జార్గన్‌ను తయారుచేశాడు రమణ.

"నా చిన్నతనంలో నన్ను బుడుగు అని పిలిచేవాళ్లు. నా చిన్నప్పటి జ్ఞాపకాలు, పెద్దయ్యాక ఎదురైన అనుభవాలు కలిపితే బుడుగు అయింది. నా బాల్యాన్ని దృష్టిలో ఉంచుకుని భాషతో తమాషాలు చేశాను. నా చిన్నతనం అనుభవాలను గురించి వ్రాయవచ్చని తెలియడానికి నాకు చాలా సంవత్సరాలు పట్టింది. "డెనిస్ ది మెనేస్" కామిక్స్ కూడా నాకు ఇన్‌స్పిరేషన్ కలిగించాయి. బుడుగులాంటి పిల్లలు కూడా చాలామంది నాకు తెలుసు." (రమణ ఇంటర్వ్యూ, ఆంధ్రజ్యోతి డైలీ 27–6–1994)

బుడుగు తల్లిదండ్రులు రాధ, గోపాలం 'రాధాగోపాలం' కథల్లో ముందే కనబడతారు (1954). కుమారసంభవం పేర బుడుగు ఉద్భవం కూడా అక్కడ కనబడుతుంది. 'బుడుగు చిచ్చులపిడుగు' వేళకు బుడుగుకి ఏడేళ్లు వచ్చేశాయి. ఓ పుస్తకానికి కథానాయకుడు కాగలిగినంత stature వచ్చేసింది. పుస్తకంలోని విషయమంతా ఏడేళ్లపిల్లవాడు ఇంకో పిల్లాణ్ణి కూచోబెట్టి చెబుతున్నట్టు సాగుతుంది. ఆ చెప్పడంలో కూడా 'త్వమేవాహం' అయిపోతూ ఉంటాడు బుడుగు. 'నువ్వు' ఉత్తిపుణ్యానికి మేష్టరు గిల్లేసేడని ఏడిస్తే 'మా' బామ్మా, మేష్టరు పోట్లాడుకుంటారంటాడు. అలాడీనుని 'నువ్వు గోపాళం కొడుకివి గదూ' అని అడిగేరంటాడు. మళ్లీ third person లోకి వెళ్లి చిన్నబూచాడు బుడుగు అంత కూడా లేడంటాడు. డికెక్టేవాడి కథలో కథనం సడన్‌గా first person నుండి third person లోకి వచ్చేస్తుంది. కాస్సేపటికి 'నా వెనకాతలే' అంటూ first person లోకి వచ్చేస్తుంది. 'విక్రమార్కుని సింహాసనం మార్కు..' కథల్లో 'పాసార్ధి (ఆ కథలను రమణ ఎన్. పార్థసారధి పేరుతో రాశారు) చెప్పాడు' అని పాత్రలతో అనిపించినట్టు అలాడీను 'గుహ దగ్గరకేనా, మా బాబాయి చెప్పాడులే' అనేస్తాడు మాంత్రికుడితో. లాంతరు ముందు గోకి 'అరె కథ ప్రకారం నువు ముందు రాకూడదు పో' అని ఉంగరం గోకుతాడు – ఋణానంద లహరిలో చీమ ఒక కథ చెప్పబోయి మరోటి చెప్పి నాలుక కరుచుకున్నట్లు. ఇన్ని గమ్మత్తులు చేసినా చదివేవాడికి ఏ మాత్రం గందరగోళం లేకుండా బుడుగు చెప్పే కథ అర్థమవుతుంది.

కథ చెప్పడంలో ఆ పాత్రలన్నీ మనకు ముందే తెలుసున్నట్టు చెబుతాడు బుడుగు – 'వాడు లేడూ...' అంటూ. Narrationలో కాస్త ముందూ వెనకా అయినప్పుడు మనం confuse కాకుండా 'ముందస్తుగా..' అంటూ sequence మనకు విశదీకరిస్తాడు. Format తప్పినప్పుడు వెంటనే సవరించుకుంటాడు – 'అలాడీను ఓ చిన్నపిల్లాడు. వాడు అనగనగా ఉన్నాడు' అంటూ. వర్ణనలు పెద్దగా అక్కర్లేకుండా 'ఇలా నవ్వేసి' అని మన *imagination*కే వదిలేస్తాడు చాలా వాటిని.

ఆ కుర్రాడికి గానీ ఆ కథనాన్ని గ్రంథస్థం చేసినవారికి గాని వ్యాకరణం గురించి పెద్ద పట్టింపు లేదు. ఎలా మాట్లాడాడో అలాగే రాసుకుపోవడం జరిగింది. హాచ్చెర్యపడిపోవడం, స్తానం... ఇలా ఎన్నో. లెక్కల్లోనూ అంత స్ట్రాంగు కాదు – ప్టదీ, యేడు, వందా.. అంటూ సాగుతుంది అంకెల వరస. పెద్ద పెద్ద పదాలు ఉపయోగించక తప్పనిచోట ఉపయోగించేశేడు – అర్థం తెలియకపోయినా! కానీ నిజాయితీపరుడు కాబట్టి, source చెప్పేశాడు (సాధారణంగా బాబాయే). నాకు అర్థం తెలీదనుకో అనీ ఒప్పేసుకున్నాడు కూడా. 'ఫలితం; కారణం' వీటి తేడాలు తెలియవు పాపం. 'అనుమానం–అవమానం' మధ్య మేలప్రాపిజం బాధ ఒకటి.

ఇలాటి పిల్లవాడి memoirs రాసేటప్పుడు కథ ఎలా సాగుతుంది? కథ లేనప్పుడు ఒకదాని తర్వాత మరొకటి లింకు చేసుకుంటూ అనేక విషయాలు రాయడం కష్టమైనా రమణ ఆ ఫీటు అవలీలగా చేశారు. బుడుగు కవర్ చేసిన టాపిక్స్ వరుసగా చూసుకుంటే – ప్రెవేటు చెప్పడం, బోడిగుండు, నిజం చెప్పడం, రక్షించడం, డబ్బులు సంపాదించడం, వాళ్లనాన్న మేనేజరు, సంక్రాంతి, అల్లరి, అప్సరాబాసం, మెడ్రాసు ప్రయాణం, పెద్దవాళ్లతో కమ్యూనికేషన్ గ్యాప్, చిన్నపాపాయిలను ఎలా పెంచాలి, బాబాయిలకు హెల్ప్ చేయడం, సినిమాషూటింగు, డిటెక్టివ్, ఎలక్షన్‌వాడు, బడి ఎగ్గొట్టేందుకు సలహాలు, కొత్త సంవత్సరం, అలాడీన్, బళ్లో పడిపోవడం – వీటన్నిటి గురించీ చెబుతూ బుడుగు ఎంతో విజ్ఞానాన్ని అందిస్తాడు – తన లోకం గురించి, దానిలో ఉన్న మనుష్యుల గురించి.

బుడుగు కళ్లద్వారా పెద్దవాళ్లు అంత glamorous గా కనబడరు. వాళ్లు హిపోక్రాట్లు. బుడుగు వైసు గురించి కూడా అబద్ధాలు చెప్తారు. నిజం చెప్పడానికి వేళాపాళా ఉండాలంటారు. అలీసెంగా నిజం చెప్తారు. ఏం చెప్పాలో గ్నాపకం రాకపోతే ఏడిశావు అంటారు. తాము చిన్నప్పుడు బళ్లోకి వెళ్లి అవస్థపడినా పెద్దయ్యాక పిల్లల్ని బడికి వెళ్లమని నసపెడతారు. అల్లరి చేస్తే తిడతారు. చెయ్యడం మానేస్తే కంగారు పడతారు. ఎవరైనా వచ్చినప్పుడు తామన్నమాట నిరూపించుకోవడానికి అల్లరి చేయమని ఒత్తిడి చేస్తారు. పిల్లల్ని ముద్దు పెట్టుకుని బుగ్గలు ఎంగిలి చేస్తారు. మరీ చిన్నపిల్లల ఉంగా ఉంగా (ఉంగా ఉంగాల కథ రాసిపెట్టినవాడు నండూరి రామమోహనరావు) తెలుగులో అర్థం చేసుకోలేరు. సినిమాపెద్దవాళ్లు మరీ అన్యాయం, నవ్వేవాణ్ణి ఏడవమంటారు.

అందరు చిన్నపిల్లల్లాగానే బుడుగు కూడా ఎదగడానికి తొందరపడతాడు. తను చిన్నపిల్లవాడు కాదన్న ఇగో ఉంది. తన వయస్సు ఎక్కువ చేసి చెప్పిన బాబాయి 'బెష్టు' బుడుగు దృష్టిలో. (వాళ్ల నాన్న దృష్టి మరోలా ఉంది. బుడుగుని 'అడ్డబాబాయి' అని తిడతాడు.) పెద్దవాడయినందున గ్నాపకం తగ్గిపోతోందన్న confession ఒకటి పైగా. పెద్దవాళ్లు ఏడవరు కాబట్టి ఏడవకూడదన్న అవగాహన, చిన్నపిల్లవాడనుకుని పెద్దలు ముద్దుముద్దుగా మాట్లాడితే చికాకు, అన్నీ ఉన్నాయి. కాస్త బడాయి కూడా ఉంది. 'నాన్నంతటి వాడు వాడూ, నా అంతవాడు నేడు', పదిరోజుల సెలవులికి వెళితే మెడ్రాసు వాళ్లది అయిపోతుంది. ఒక్కోప్పుడు చిన్నవాడిగా ఉంటే లాభాలు కూడా తెలుసు బుడుగుకి. నెత్తిమీద దేవుడుంటాడు కాబట్టి కొట్టకూడదని పాయింటు లేవనెత్తుతాడు. దాంతో బాటు పిల్లల బాధ్యత కూడా తెలుసు – అలీసెంగా నిజం చెప్పకూడదని అలా చేస్తే అబద్ధం చెప్పినట్టే అన్న స్పృహ కూడా ఉంది.

కానీ కొన్ని విషయాల్లో పాపం బుడుగు ఎంతో కన్‌ఫ్యూజ్ అవుతాడు. అమ్మాయి ముందుకో జడా, వెనక్కో జడా వేసుకుంటే వస్తోందో, పోతోందో ఎలా తెలుస్తుంది? గుండుకి 'మెడ్రాసు క్రాపింగుషాపు' ఎందుకు చేయరు? మేలుకున్నప్పుడు తిట్టిన పెద్దాళ్లకు తను నిద్రపోయినప్పుడు ఎందుకు ముద్దొస్తాడు? జుట్టు దువ్వుకోకపోతే తను బాగుండడు. అమ్మ బాగుంటుంది. (అమ్మంటే బుడుగుకి వర్షిప్) ఏం? పాలిచ్చే జంతువులు అయిదు చెప్పాలంటే అందులో మూడు ఆవులుంటే నష్టమేమిటి?

ఇంత లోకం చూసినవాడికి ప్రవచనాలు ఇచ్చే హక్కు సహజంగానే ప్రాప్తిస్తుంది. అందుకే అంటాడు – 'ఈ పెరపంచకంలో ప్రెవేటు లేకుండా మనికి యేం రాదు గదా మరి' అని. అంతేకాదు బోల్డు విసుర్లు విసురుతాడు – 'దమ్మిడీలే కాణీగా చలామణీ అవుతున్నాయి' (1957 నాటి inflation పై), 'ఓటేస్తే జటకా తోలుకోవడమే' (రాజకీయ నాయకులపై), 'డాన్సు అంటే పరుగుపెట్టడమే' (సినిమాడాన్సులపై), 'హీరోయిన్ని ఏడిపించకూడదని హీరో పాట మానేస్తాడు' (సినిమాపాటలపై), 'ప్రేమించడం అంటే ఎవరికీ తెలీదు అని నాన్న అన్నాడు' (ప్రేమ అనే మిస్టీరియస్ థింగ్ పై). భయానికి, ధైర్యానికి ఇచ్చే నిర్వచనం సందర్భం బట్టి మారుతూంటుంది. సహజమే కదా! అలాడీను కథకు anti-climax యిచ్చి, 'ఏం చేసినా లాభం లేదులే, కష్టపడి బళ్లోకి పోయి గబగబా చదివేసుకో'మని సలహా యిస్తాడు.

అయితే ఇవన్నీ చెప్పడానికి బుడుగు తనకొచ్చిన భాష ఉపయోగించాడు. కొన్ని చోట్ల కొన్ని మాటలను అలాగే literal meaning లో వాడేశాడు పాపం. 'లావుపాటి బొమ్మ 'వెనకేసుకు రావడం', నా 'మొహం' లా ఉండడం,' బాబాయి 'వరస', తోకలాగితే కుక్క కరవడం, 'బోడి' నిజం, 'మా అమ్మ కదూ, మా నాన్న కదూ',

పోరా అంటే పోనురా అనడం', నిజం ఊరు– అబద్ధం ఊరు, 'అర'టిక్కెట్టు, 'హాచ్చర్య'పడి, పోయేసి లేవడం – ఇలాటివి. కొన్ని చోట్ల మాటలు jumble అయిపోయాయి – కలట్ కర్, తమిడి, పెరపెంచకం, సంకురాతిరి, పుట్టార్తడం, అయిసుపూట్రు, డైరెట్కార్, ఎలష్కను, అష్పరాబాసం. ఎలా ఉచ్చరించాడో అలాగే చెప్పాడు – బూడుసురైలు, స్సంబం, బుడుబుడకలవాడు, సిగరొత్తులు, అగరెత్తులు, గ్రుహా, కురో, వింజను. భాషతో కొన్ని వినూత్న ప్రయోగాలు చేశాడు కూడా – అబద్ధాలు చేయడం, డబ్బులు తెచ్చుకోవడం, ఏడచకుండా, నడ్డిమీద చంపడం, ఒంటో బావుండలేదనడం రావడం, వేగలేకపోతున్నడం, మనచేత నిజం చెప్పడం, పెళ్లాడతావురాలెండి, సినిమావాడులారా. బుడుగు కాయిన్ చేసిన జాటర్‌డమాల్ సంగతి చెప్పనే అక్కర్లేదు.

బాల్యాన్ని ఇంత అందంగా చిత్రీకరించిన రమణ బాల్యం ఎలా గడిచిందో చూడబోతే – రమణ పూర్వీకులు బరంపురం వాళ్లయినా ఆయన కథ ధవళేశ్వరంలోనే ప్రారంభమయింది. తండ్రి శ్రీ సింహాచలం గోదావరి ఆనకట్ట ఆఫీసులో అధికారి. గోదావరి ఒడ్డున మేడ. రేవులో పేద్ద మేడంత దరోతి ఓడ. ఇల్లంతా వచ్చేపోయే బంధుజనులతో కోలాహలంగా ఉండేది. ఒక అమ్మాయి తర్వాత రమణ జననం. 1931 జూన్ 28న. (కరెక్టుగా చెప్పాలంటే 28 తెల్లవారురుఝామున, అంటే 29 early hours అన్నమాట. కానీ అభిమానులు రమణ పుట్టిన రోజును జూన్ 28నే జరుపుకుంటున్నారు.) తండ్రి హఠాన్మరణంతో కుటుంబం రోడ్డున పడ్డట్టయింది. రమణ తల్లి సాహసం చేసి మద్రాసు వచ్చేశారు. ప్రాథమిక విద్య అక్కాబావల వద్ద మద్రాసులో P.S.హైస్కూలులో 5, 6 తరగతులు చదివారు రమణ. 7, 8 వీరేశలింగం హైస్కూలు (రాజమండ్రి) తర్వాత ఎస్సెల్సీ ఆనర్స్‌దాకా కేసరీస్కూలు.

ఫిఫ్త్‌ఫారంలో ఉన్నప్పుడే డిబేట్లలోను, వ్యాసరచన పోటీలలోను పాల్గొనటం అలవాటయింది రమణకు. లెక్కల్లో చాలా ప్రతిభ కనబరచేవారు. 1945లో 'బాల'లో కథ పడింది – 'అమ్మమాట వినకపోతే' అని – పద్యాలు అల్లడం హాబీ అయింది. ముళ్లపూడి వెంకటరావు (అదీ ఆయన అసలు పేరు) పేరుతో రాసిన బాలశతకం పద్యాలు 'బాల'లో పడ్డాయి. ఆ ఉత్సాహంతోనే 'ఉదయభాను' అనే వ్రాతపత్రిక ప్రారంభించి ఎడిటరయిపోయారు. పత్రికకు ఆర్థిక స్తోమత రావడానికి మిత్రులతో కలిసి ఒక ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఆ డబ్బుతో సైక్లోస్టైయిల్ మిషన్ కొన్నారు. పత్రికకు రమణ ఎడిటరయితే, బాపు బొమ్మలు. మండలీక కామశాస్త్రి వ్రాయసకాడు.

చదువు వెనకపెట్టకుండానే రమణ ఆటల్లోను, నాటకాల్లోను పాల్గొనేవారు. చంద్రగుప్త నాటకంలో చాణక్య వేషం వేసిన రమణ పోను పోను స్టేజి ఫియర్ అలవర్చుకున్నారేమో! స్కూలు చదువు సాగించడానికి నాలుగయిదుచోట్ల ట్యూషన్లు చెప్పసాగేరు. ఆర్థిక కారణాల వల్ల 1947లో పదహారోయేట ఎస్సెల్సీతో చదువు ఆపిన రమణకు కనపడిన ప్రతీ పుస్తకం చదివి సంపాయించిన జ్ఞానమే పెట్టుబడి. ఎస్సెల్సీ తర్వాత రేడియో ఇంజనీరింగ్ చదివేరు. ఆ తర్వాత అనేక చిన్నా, చితకా ఉద్యోగాలు చేశారు, 1954లో ఆంధ్రపత్రిక డెయిలీలో సబ్ ఎడిటర్‌గా చేరేవరకు.

ఆంధ్రపత్రికలో ఉద్యోగం చేస్తుండగానే 'బుడుగు' రచించడం జరిగింది. బళ్లో పడిపోవడానికి అల్లరి మానేయాలని బుడుగు నిశ్చయించుకోవడంతో (24.4.57) సీరియల్ ఆపేశాక, నాలుగేళ్ళకు 'హురేయ్, మళ్లీ నేనే!' అంటూ బుడుగు పునర్దర్శనం ప్రసాదించారు రమణ. అందుకే గోపాళం, రాధ గురించి re-introduction కనబడుతుంది. ఈ పాటికి బుడుగు తెలివిమీరాడు. 'సీతా లేదు, పీతా లేదు' అంటాడు. సత్యభామ కృష్ణుడికి ప్రైవేటు చెబుతుందని తెలుసుకుంటాడు. అణ్వాస్త్రభయం గురించి, మేష్టర్ల జీతాల గురించి ముచ్చటిస్తాడు. కొత్త ఎంకిపాటల్లో ఎంకి 'శ్రీమతి వెంకి' అయిపోయిందని అన్నవారు బుడుగును వేలెత్తి చూపనీయకుండా అంతకు మించి బుడుగును కొనసాగదీయలేదు రమణ. కానీ సినిమాల్లోకి వచ్చాక బుడుగుని తెరకు లాక్కొచ్చారు 'అందాలరాముడు'లో. 'బుడుగు' టీవీ సీరియల్‌గా తీద్దామనే ప్రయత్నాలు సాంకేతిక కారణాల వల్ల సాగలేదు.

పిల్లల హృదయాలను ఇంతగా అర్థం చేసుకున్నవారు కాబట్టే బాపు–రమణలు తమ సినిమాల్లో పిల్లలకు పెద్దపాత్రలిచ్చారు. ('బాలరాజు కథ' వంటి పూర్తి బాలల చిత్రం సంగతి సరేసరి.) వారి సినిమాల్లో పిల్లలు పెద్దతరహాగా మాట్లాడి చికాకు తెప్పించకుండా హాయిగా, అతి సహజంగా ఉండి మనకు ఆత్మీయులవుతారు. 'ముత్యాలముగ్గు', 'మిస్టర్ పెళ్లాం' సినిమాలు గుర్తుకురాగానే వాటిలో బాలపాత్రలూ గుర్తుకు వస్తాయి. చిన్నపిల్లల

మీద మక్కువతోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం కోసం వీడియోపాఠాలు 1987లో తీసిపెట్టారు. ప్రచారానికి, పదవులకు దూరంగా ఉండే రమణ 1990లో చిల్డ్రన్ ఫిలిం సొసైటీ ఎక్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా ఉండడానికి అంగీకరించడం, 1992లో బాలల అకాడెమీ పక్షాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇచ్చిన 'బాలబంధు' బిరుదు స్వీకరించడం పిల్లలంటే ఇష్టంతోనే.

ఇటీవల 7వ తరగతి పాఠ్యపుస్తకాల కెక్కిన 'బుడుగు' ఇప్పటికీ, ఎప్పటికీ మనందరికే కాదు, రమణకూ అభిమాన రచనే. తన అభిమాన సబ్జక్టులు – ప్రేమ (బాబాయి), సినిమా (డైరెక్టరు), రాజకీయం (ఎలక్షనువాడు), అప్పులు (డికెక్టీవాడు అప్పులాళ్ల భయంతోనే vanishing trick చేస్తాడు) అన్నిటికీ 'బుడుగు'లో చోటిచ్చారు. ఈ సంకలనంపై, ఈ వ్యాసంపై పాఠకులు తమ అభిప్రాయాలను తెలిపితే రచయిత (No.4, Greenways Road Extn., Raja Annamalaipuram, Chennai - 600 028 ఫోన్ నెం. 4937109), సంపాదకుడు (Flat No.502, Siri Enclave, 8-3-960, Srinagar Colony, Hyderabad 500 073, Ph: 3743567) ఆనందిస్తారు.

బుడుగు వంటి చిరంజీవికి, ఆ చిరంజీవిని సృష్టించిన సాహితీ చిరంజీవికి లభించిన అరుదైన ఆశీర్వాదం ఒకటుంది. అది అక్షరాశీర్వాదం. పెద్దలను పిన్నలు అనుకరించారంటే అది సహజం. కానీ బుడుగు విషయంలో రమణ మల్లాది రామకృష్ణశాస్త్రి గారి వంటి మహామహులనే ముగ్ధులను చేసి తనను అనుకరింప జేసుకున్నారన్నది ఈ క్రింది అక్షరాల సాక్షిగా సత్యం! "నేనూ – నా కతలు" అనే కథా ప్రారంభానికి రామకృష్ణశాస్త్రి గారు ఎంచుకున్నది బుడుగు భాష. 'అయనంతటివారు రమణగారిని కొంత అనుకరించారంటే అది వాత్సల్యంతో కాగితం మీద పెట్టిన దీవెన' అంటారు ఆరుద్ర. పీఠిక ముగింపుకి ఆ కథారంభం కంటే తగినది ఏముంటుంది?

"అనగనగా–

ఒక ఊళ్లో, మా ఇల్లు వుండేది, లంకంత ఇల్లు –

ఆ ఇంట్లో రాచ్చేసులు, ఏరీ–

వాళ్లు ఇంట్లో ఉండరు. ఎప్పుడూ దొడ్డినపడి, కాకుల్లాగా అల్లరి చేస్తుంటామని అమ్మ తిడుతుందా –

అమ్మకు బోలెడు పని. చెంబులూ తప్పాలాలూ, అమ్మకు అందకుండా పరుగెత్తుతూంటాయి. కొడితే సొట్టపోతాయని అమ్మ వాళ్లను కొట్టదు.

నన్నూ కొట్టదు. కొడితే పటికబెల్లం పెట్టాలిగా!

ఉహూ, ఉహూ – అంటే పిప్పరమెంట్లు, బిసకోతులూ –

అన్నీ తింటే – అన్నం ఎందుకూ?

తినకపోతే, మామ్మ కత చెప్పదుగా –

మామ్మంటే, వాళ్ల సుబ్బులు లేదూ, వాళ్ల నాన్న అమ్మా అని కేకలేస్తూంటాడే, ఆయన అమ్మ!

సుబ్బులే వాళ్ళ మామ్మనే నాక్కూడా తాయిల్లం పెట్టింది.

– సుబ్బులు గారి మామ్మకే కళ్లు లేవు. అంటే మనం కనబడంట! వినిపిస్తాంట! ఎన్ని కథలు చెప్పింది, ఏమో నాకు లెక్కలొచ్చా యేమిటి–

ఒక్కటొచ్చు అంతే. మామ్మ చెప్పినవన్నీ గ్యాపకం వున్నాయా! గ్యాపకం వుంటే, మళ్లీ చెబుతానా? నేనేం మామ్మనా, కళ్లు మూసుకుని నిద్దరోతుంటే కతలన్నీ వచ్చేస్తాయి. నాతో మాట్లాడవు. వాళ్లతో వాళ్లు ఆడుకుంటారు.

ఇదీ, కథ! అంటే నా కథ!"

– ఎమ్బీయస్ ప్రసాద్

# ముళ్ళపూడి వెంకటరమణ
# సాహితీ సర్వస్వం

రూ.

మొదటి సంపుటం : కథారమణీయం-I 150-00

సీతాకళ్యాణం, ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ,
జనతా ఎక్స్‌ప్రెస్, రాజకీయ బేతాళ పంచవింశతి - ఇతర కథలు.

రెండవ సంపుటం : కథారమణీయం-II 150-00

ఋణానందలహరి, కానుక, రాధాగోపాలం, సాక్షి,
ఆకలీ-ఆనందరావు, విమానం కథ - ఇతర కథలు.

మూడవ సంపుటం : బాలరమణీయం - బుడుగు 80-00

నాల్గవ సంపుటం : కదంబరమణీయం-I 150-00

నవ్వితే నవ్వండి, పీఠికలు, వ్యాసాలూ, ఇతర రచనలు.

ఐదవ సంపుటం : కదంబరమణీయం-II 150-00

గిరీశం లెక్చర్లు, కృష్ణలీలలు, వ్యాసాలు, ఇతర రచనలు.

ఏడవ సంపుటం : సినీరమణీయం-II 150-00

కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవితచరిత్ర),
చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు.

ఆరవ సంపుటం : సినీరమణీయం-II 150-00

చలన చిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాల సమీక్షలు,
విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు,

త్వరలో...

ఎనిమిదవ సంపుటం : అనువాదరమణీయం

ఎనభై రోజుల్లో భూప్రదక్షిణ, పిటి 109.

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,** విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు-1.

**విశాలాంధ్ర బుక్ హౌస్,** హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్), విజయవాడ,
అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.



# బుడుగు! చిచ్చులపిడుగు

## ఈ బొమ్మ నేను.



నా పేరు బుడుగు. ఇంకో పేరు పిడుగు. మా బామ్మ హారి పిడుగా అంటుంది. అందుకు.

ఇంకో అస్సలు పేరుంది. ఇప్పుడు చెప్పడానికి టైములేదు. అది చాలా పొడుగు. కావాలిస్తే మా నాన్నని అడుగు.

అగో మా నాన్న. మా నాన్నకి నేను కొడుకు. మా నాన్న నాకు గొడుగు. ఇలా అని కొత్త ప్రైవేటు మేష్టరు చెప్పాడు. వీడు మంచివాడు కాడు. అంటే చెడ్డవాడు. అసలు వీడే కాడు. ఈ ప్రైవేటు మాష్టర్లు అందరూ అంతే. చిన్నపిల్లలకి చదువు చెప్పడంరాదు. పైగా సొంటిపిక్కలు తీస్తానంటారు. ఈడుకి తగని లెక్కలు చెయ్యమంటారు.

ఆ లెక్కలు చూసి బామ్మ కూడా అమ్మ బాబోయ్ అనేసింది. (బామ్మకి అ ఆ లు కూడా బాగా రావుట). అంటేనేం మళ్ళా మేష్టరొస్తే రండి బాబూ అని చాపేస్తుంది.

అలుసు అంటే ఇదే. (ఈమాట బామ్మ చెప్పింది.). ఈ మాష్టరు అలుసు తీసుకున్నాడు. తీసుకుని నన్ను తిడుతున్నాడు. నేనేం చిన్నవాడినా లేకపోతే చితకవాడినా! (నాన్న సిగరెట్లు చాలా కాలిస్తే బామ్మ చిన్నవాడివా చితకవాడివా అంటుందిలే).

ఇప్పుడప్పుడే ఏడో ఏడు నాకు. ఏడాదినుంచీ ఈ మేష్టర్లు నాకోసం వస్తున్నారు, ఒకడి తరవాత ఒకడు. వీడు పదోవాడు కాబోలు, అందరూ నన్ను డబాయించడమే. ముందర చాక్‌లెట్లు తెస్తారు. ఒక్కడూ పకోడీలు తేడు. పైగా ఆ చాక్‌లెట్లు ఇచ్చినందుకు లెక్కలు చేసిపెట్టమంటాడు. వాడు పది ఇస్తే (ఉత్తది ఒకటో రెండో తెస్తాడు). నేను రెండు తింటే.........ఎన్ని వుంటాయి అంటాడు. నేను ఏదో చెప్పుతా. రెండు రోజులయ్యాకా, తిట్టుతాడు. నేను చిన్నవాడినా లేకపోతే చితకవాడినా. మేష్టరంతవాడు, నా అంత వాడు నేడు. ఆ సంగతి చెప్పుతానా...... వాడు ఒకలా మొహం

పెడతాడు. ఉత్తినే నన్ను కోప్పడి......ఆనకేమో నేను చూడకుండా నాన్నకి పితూరి చెప్పకుంటాడు.

ఎందుకు చెప్పాలి! అందుకే నేను తరవాత కోప్పడేస్తాను. ఆ మేష్టరు ఇంక రాడు. తరవాత ఇంకో కొత్తవాడు.

మళ్ళీ నాన్న నన్ను కోప్పడతాడు. రౌడీ రాస్కిల్ అటాడు. మేష్టరు మాటలే అందరూ వింటారు.

అమ్మ నన్ను పోకిరీ వెధవా అంటుంది. ఒక్కోసారి వెధవకానా అంటుంది. బామ్మ ఆరి పిడుగా అంటుంది. బామ్మ మంచిది.

నా అంతవాడు నేడు. నన్ను ఎవరూ తిట్టకూడదు. కొట్టకూడదు. కొట్టితే పాపం, అసలు నేను చిన్నవాడిని, నా నెత్తిమీద దేముడుంటాడు. నన్ను కొట్టితే వాణ్ణి కొట్టడం అన్నమాట.

నేను నిఝంగా పెద్దవాణ్ణే అనుక్కో. అందుకని కొట్టొచ్చు. ఐతే, వాళే నన్ను కుర్ర కుంక అంటారుగా. అందుకనే నన్ను కొట్టకూడదు, ఇదే నా అభిప్రాయం.

ఈ మాట బాబాయి నేర్పాడు. బాబాయి దగ్గర ఇవి చాలా ఉన్నాయి.

నా చదువు సమస్యట. సమస్య అంటే కొత్త ప్రైవేటు మేష్టర్ని తేవడం. ఎవడూ రానంటున్నాడట. అసలు ఇప్పుడు చదువూ సంధ్యా వద్దు అంటాడు బాబాయి.

ఇది బాబాయి అభిప్రాయం. బాబాయి సంధ్యావార్చడు. నాన్నకూడా. బామ్మ రోజా గంజి వార్చుతుంది.

బాబాయి మాట ఎవరూ వినరు. ఏడిశావు పో అంటారు. వాళ్ల కాలేజిలో ఓ అమ్మాయి ఉంది. ఫరవాలేదు బాగానే ఉంటుందనుకో. అది ఒక్కటే బాబాయి మాట వింటుంది. యస్ అంటుంది. యస్ అంటే ఇంగ్లీషు అన్నమాట. నాకు ఇంగ్లీషు ఇంకా బాగా రాదు. అయినా ఆ మాటలకి అర్థాలున్నాయట. ఎందుకుండవు? తెలియాలి అంతే. నాకు కోపం వస్తే జాటర్ డమాల్ అంటాను.




అది ఎవరికీ తెలియదు. నేను అలా అంటే నాన్న జడ్డివెధవా అంటాడు. ఆ మాటకి అస్సలు అర్థం లేదంటాడు. ఎందుకు లేదు? ఉంటుంది. తెలియాలి, అంతే. జాటర్ డమాల్ అంటే అర్థం లేదూ అని అర్థం అన్నమాట.

ఇది ఒక్క ప్రైవేటు మేష్టరుకే తెలుసు. ఆ మేష్టరుకి నేనేంచెప్పినా తెలుస్తుంది. తెలివిగల వాడన్నమాట. అందుకే నాదగ్గిర మానేశాడు.

ఇప్పుడు కొత్తవాడు. వీడు మహాయితే పదిరోజు లుంటాడేమోలే. చిన్నపిల్లల్ని (నేను కాదనుకో. నేను పెద్దవాణ్ణి) ఎలా నేస్తం కట్టాలో, నేను సలహా లిస్తాను. సలహా అంటే అభిప్రాయం, అంటే నాకు బాగా తెలీదు. బాబాయి నడుగు.

నా దగ్గిర పది మేష్టర్లు పనిచేశారు. వాళ్ళు చేసిన తప్పులు నాకు కంఠతావచ్చు. నా తొడమీద, చెవిమీద ఇంకా ఆ మార్కులు ఉన్నాయి. అందుకని కుంచెం సలహాలు ఇస్తాను. అప్పుడు పెంకిమేష్టర్లని ఏంచెయ్యాలో మంచిపిల్లలికి తెలుస్తుంది. మంచి పిల్లలికి ఎలా చదువు చెప్పాలో పెంకిమేష్టర్లకి తెలుస్తుంది.

అసలు ప్రైవేటు చెప్పడం అంటే తిట్టడం అని అర్థం. కొట్టడం అని కూడా అర్థం.

ఈ ప్రపంచకంలో ప్రైవేట్లు ఎన్నోరకాలు. ఎన్నిరకాలో నే చెప్పలేను. పది రకాలుంటాయేమో. ప్రైవేటు మేష్టర్లు కూడా ఎన్నోరకాలున్నాయి.

మొగ మేష్టర్లు, ఆడ మేష్టర్లు, కళ్ళజోడువీ, నల్లకోటువీ.......ఇంకా గుండు మేష్టర్లు, పిలక మేష్టర్లూ (పూర్వకాలంలో నాకు ఈ రెండూ ఉండేవి. మేష్టర్లు కాదు, గుండూ పిలకానూ)

కొంతమంది చూట్టానికి అచ్చంగా ప్రైవేటు మేష్టర్లలా ఉంటారు. కాని నిజంగా కాదు.

కొంతమంది చూట్టానికి ప్రైవేటు మేష్టర్లలా ఉండరు. కాని నిజంగా అవును.

ఇంకుంచెంమంది చూట్టానికీ, నిజంగానూ ప్రైవేటు మేష్టర్లే. అలాగే కొన్ని మేష్టర్లు కుంచెం పాఠం చెప్తారు. కొందరు ఉత్తినే తిట్టుతారు.

మా యింట్లో బామ్మ, నాన్న, బాబాయి వీళ్ళు ఇంకోరకం ప్రైవేటు మేష్టర్లు అన్నమాట.

పొద్దున్నే అమ్మేమో బామ్మకి వంటకి కావలసినవి అన్నీ చప్పున యియ్యాలి. యియ్యకపోతే బామ్మ యిలా కోపంగా ముహంపెట్టి అమ్మకి ప్రైవేటు చెప్పేస్తుంది.

అమ్మ నన్ను ఎప్పుడేనా కొటితే, నాన్న అప్పుడు అమ్మకి ప్రైవేటు చెప్తాడు. నేను దెబ్బలాట అనుకున్నాను కాని, ప్రైవేటు అని బాబాయి చెప్పాడు.

మధ్యాన్నం అప్పుడు, బామ్మ ఒక్కోసారి అమ్మ బుగ్గమీద వేలితో పొడిచి నీ యిల్లు బంగారంగానూ అని కోప్పడుతుందా; అమ్మ మాత్రం యాడవదు. ఓలా నవ్వుతుంది. (అమ్మ అలా నవ్వితే భలే బావుంటుంది. నేను కూడా అలా నవ్వగలను). ఒక్కోసారి నాన్న ప్రైవేటు చెప్పినప్పుడు కూడా అమ్మ గారిగా నవ్వుతుంది.

ఓసారేమో నాన్నేమో, అమ్మ చెవి పట్టుకుని కీ ఇస్తున్నాడు.

అంతట్లోకీ నాకు ఆకలేసింది. అమ్మా ప్రైవేటు అయిందా, ఆకలేస్తోంది అన్నం పెట్టుదుగాని అన్నాను.

అమ్మకి కోపం వచ్చింది కాబోలు. కాని అప్పటికింకా నవ్వు అయిపోలేదు. అందుకని రెండు తోటీ, "ఛీ ఫోకిరీ వెధవకానా" అంది కోపంగానూ, నవ్వుతూనూ.




నాకు తరవాత బాబాయి చెప్పాడు. ప్రైవేటు చెప్తుంటే అన్నం పెట్టమనకూడదూ అని. ఇగో ఈ పెద్దవాళ్ళేం, ఎప్పుడూ ఏమిటీ సరిగ్గా చెప్పరు. దీన్నే లోపం అంటారుట. ఇలా అని మనం అంటే మళ్ళీ కోపం.

ఇంతెందుకు, ఆ వేళ సాయంత్రమే బాబాయి నన్ను సావిట్లో కూర్చోపెట్టి ప్రైవేటు చెప్తున్నాడా, లెక్కలో ఏవో. అంతట్లోకి ఓ నిఝ్ఝం ప్రైవేటు మేష్టరులాంటాయన ఒచ్చాడు.



ఒచ్చి, నన్ను చూసి ప్రైవేటు చెప్పేకుంటున్నావా బాబూ అన్నాడు.

నాకు ఒళ్లుమండిపోయింది. పొద్దున్నేగదా ప్రైవేటు చెప్తున్నపుడు ఎవళూ వచ్చి మాట్లాడకూడదనన్నాడు బాబాయి. పొద్దున్న అందుకనే అమ్మ నన్ను తిట్టింది కూడా. ఈ ప్రైవేటు మేష్టరులాంటి ఆయన చిన్నవాడా చితకవాడా. అందుకని నాకు ఒళ్లు మండిపోయింది.

"ఛీ ఫోకిరీ వెధవకానా" అన్నాను.

అంతే. ఇంకేం అనలేదుగదా. కాని బాబాయి మొట్టికాయి వేసేశాడు. అంతట్లోకే బామ్మవచ్చి ఆరి పిడుగా అంది. అమ్మ వచ్చి డిప్పకాయ వెధవా అంది. ఆ ప్రైవేటు మేష్టరు లాంటి ఆయన కూడా ఆరి భడవా అనేశాడు.

ఇంతవరకూ నా తప్పు ఏమిటో వాళ్లు చెప్పలేదు. మేష్టరు అని అంటే దేముడు అని మాత్రం

చెప్పారు. అనకపోతే ఏమిటో చెప్పలేదు హన్నా అన్నారు. అప్పుడు వచ్చినవాడే నాకు కొత్త ప్రైవేటు మేష్టరుట.

ఎవడికి తెలుసు ముందస్తుగా చెప్పకపోతే? మహమహ మా బామ్మకే తెలీదు.

అందుకని ప్రైవేటు మేష్టర్లు కొత్తగా ఒచ్చినప్పుడు ముందస్తుగా వాళ్లేనా చెప్పాలి. లేకపోతే అమ్మా నాన్నా యేనా చెప్పాలి.

లేకపోతే, ఇలాగే అవుతుంది. ఇలాగే అయితే, పిల్లలు ఊరుకోరు. నేను మంచివాణ్ణి కాబట్టి (అప్పుడు అందరూ నన్ను పెంకివెధవాయి అన్నా) పోన్లే గదా అని, ఆ మేష్టరుచేత మూ్డ్రోలుదాకా ప్రైవేటు చెప్పించాను. అదే యింకోడైతేనా ఒకరోజు కూడా ఛాన్సు ఇవ్వడు.

నా దగ్గిర పదిమేష్టర్లు పని చేశారనుకో; వాళ్లందరూ నిఝంగా మంచివాళ్ళే. నేనంటే ఇష్టం. కాని పాపం రెండ్రోలో పదకొండ్రోలో అయ్యాక వాళ్ళే మానేసేవాళ్లు. నన్ను భరించలేను అని చెప్పారుట నాన్నతో. (భరించడం అంటే మొయ్యడం అని బాబాయి చెప్పాడు) ఉత్త అబద్ధం. నేను వాళ్ళ వీపుమీద సవారీ చేస్తానని ఎప్పుడూ అనలేదు కూడా. అయినా వాళ్ళలా అనడం అన్యాయం కాదూ? అని అడుగుతున్నాను.




అయితే అన్యాయం అని తెలీదు వాళ్ళకి. అపార్థం తెచ్చుకున్నారన్నమాట. అంటే కోపం తెచ్చుకోవడంట. ఇలా అయితే పిల్లలు ఎంత అపార్థం తెచ్చుకోవాలి?

ఒక మాట చెప్తా విను. నేనున్నాననుకో. నాకు ప్రైవేటు చెప్పిన ఒక్కొక్క మేష్టరు ఒక్కొక్కలాంటివాడు. ఒక మేష్టారేమో నా చెవికి కీ ఇచ్చినపుడేమో యిలా ఎడమవేపుకి తిప్పుతాడుగదా.

పోన్లే అని ఊరుకుంటామా, ఇంకో కొన్నాళ్ళకి కొత్తవాడొస్తాడు కదా? వాడేమో ఆ చెవినే కుడివేపుకి మెలిపెడతాడు. మళ్ళా ఇంకో మేష్టరు ఎడంవేపుకి తిప్పుతాడు. ఇలా అవుతే చెవి పాడైపోదూ.

అంతేకాని అయ్యో కుర్రవెధవ, వీడి చెవిని ఇదివరకటి మేష్టరు ఎటువేపు మెలివేశాడని అడుగుతాడా అని చూస్తాను. ఎవ్వడూ అడగడు.

పోనీ మా నాన్నా, అమ్మా ముందస్తుగా చెప్తారా. చెప్పరు. నే నెందుకు చెప్పాలి. చెప్పను.

యిప్పుడు చెప్తాననుకో.

యేమిటంటే, ముందు మేష్టర్లకి సలహాలు ఇస్తాను. యెందుకంటే, మేష్టర్లంటే గురువు. గురువంటే దేముడట. అందుకు.

ఒకటి: ప్రైవేటు మేష్టరు కొత్తగా ఒక కుర్రాడింటికి ఒచ్చేటప్పుడు ముందస్తుగా పాతమేష్టరు ఇంటికెళ్ళాలి. వెళ్ళి ఇగో పాతమేష్టరూ పాతమేష్టరూ నువ్వు అల్ల వారిపిల్లడు ఫలానా బుడుగుకి చెవి ఎలా మెలిపెట్టేవాడివి? ఎడంవేపుకా, కుడికా? అని అడిగిరావాలి. లేకపోతే, ఫలానా నన్నే అడిగెయ్యాలి. అప్పుడు నేను చెప్తాను.

ఇంకోటి: కొత్త మేష్టర్లు కుంచెంరోజులేనా తలపాగా చుట్టుకురావాలి. ఎందుకంటే, కొన్నిసార్లు పెంకిపిల్ల లుంటారు. గుండుమీద కొట్టుతారు. పెంకిపిల్లలేమిటిలే. ఓసారి నేనే అలా చేశాను ఒక మేష్టర్ని.

ఫది: చాక్‌లేట్లు తెస్తే యేం లాభంలేదు. వేడి పకోడీలు తెస్తే పిల్లలు మీ మాట వింటారు. (నన్నడిగితే, ఓ కబురు చెప్తా. మా పక్కవీధిలో నారాయణ కొట్టులో పకోడీలు బావుంటాయి).

పదకొండు: పెద్ద పెద్ద మీసాలతో మా ఇంటి దగ్గిర నాగన్న అంత మీసాలతో చిన్న పిల్లలకి చదువు చెప్పడానికి రాకూడదు. కొందరికి బయం వేస్తుంది. ఇంకొందరికి, పాఠం విన్నా బుర్రకెక్కదు. ఉత్తినే అలా ఆ మీసాలవేపే చూడాలనిపిస్తుంది. మేష్టరు మాట్లాడినప్పుడు "విష్వక్సేనుడు" (ఈ మాట ఎలా రాయడమో బాబాయి నేర్పాడు) లాంటి మాటలు అన్నప్పుడు మీసాలు తమాషాగా కదులుతాయి. అందుకు.




డబ్బై: మేష్టరు రోజూ రాకూడదు. ఓసారి తలనెప్పి అని, ఇంకొకసారి జెరం అని (కడుపునొప్పి అనకూడదు – ఎందుకంటే, అది మేష్టరొచ్చినప్పుడు పిల్లలికి రావాలి) ఎగగొట్టాలి. అలాచేస్తే పిల్లలు నేస్తం అవుతారు.

వంద : ఇంకొక్కటి. ఈ ప్రైవేటు కోసం అని షెషల్‌గా వేరే గది ఇస్తే ఒద్దు అని చెప్పండి. నా మాట వినకపోతే మీకే నష్టం.

ఇంక పిల్లలకి కుంచెం చెప్తాను. ఇక్కడ్నించి పెద్దవాళ్ళు – ముఖ్యంగా ప్రైవేటు మేష్టర్లు అస్సలు చదవకూడదు.

వన్ : ఇగో, ఈ మేష్టర్లున్నారే చూట్టానికి మంచి వాళ్లేలా ఉన్నా, కుంచెం రోలుపోయాకా కొట్టుతారు. అలుసిస్తే ఇంకా కొట్టుతారు. అందుకని అది ఇవ్వకండి.

ఏంలేదు ఒకటే ముందస్తుగా, ప్రైవేటుకి షెషల్‌గా ఓ గది కావాలని అల్లరి పెట్టాలి. అందులో కూర్చున్నాక, ఓ పావుగంట మామూలుగా ఊరుకోవాలి. మేష్టరు నచ్చితే సరి. లేకపోతే ఒక్కసారిగా, "బామ్మోయ్ వీడు గిలేస్తున్నాడేవ్" అని గాఠిగ అరవడమే. వాడు నిజంగా గిల్లడనుకో. అయినా గిల్లినట్లు యాడవాలి. మీకు బాగా తెలుసుగా. అలాచేస్తే మా బామ్మా మేష్టరూ

పోట్లాడుకుంటారు – తరవాత మేష్టరు మానేస్తాడు. ఇంకో కొత్తవాడు రావడానికి పదిరోజులు కూడా పట్టుతుంది.



టూ : మంచి మేష్టరనుకో, అప్పుడు వాడు ఎలాగా రోజా రాడు. అలాంటి వాళ్లతో పోట్లాట వేసుకోకూడదు. మనకే మంచిది.

టెన్ : చిన్నపిల్లలు గుండూపిలకా పెట్టుకోకూడదు. నాకు పూర్వకాలం రెండూ ఉండేవి. అప్పుడు మా బామ్మ నన్ను చూసి పండులా ఉన్నావు అనేది. కాని, గుండు వుంటే ఎంత నష్టం అని? అందరికీ టెంకిజెల్ల కొట్ట బుద్దేస్తుంది. కొట్టుతారు కూడా మేష్టర్లు మొట్టికాయలు కూడా కొట్టుతారు. సోలడు నూని ఇంకిపోయేలా. ఇంకొన్ని నష్టాలున్నాయి. నాకు చాలా అనుభవం ఉంది కనుక చెప్తాను.

అనుభవం అంటే టెంకిజెల్లలు, మొట్టికాయలు తినడం.

ఈ పెద్దవాళ్లున్నారే వీళ్ళకి చాలా సంగతులు తెలీవు. అస్సలు ప్రపంచకంలో వాళ్ళొక్కళ్ళే పెద్దవాళ్లనుకుంటారు. మనం పెద్దవాళ్ళం అని చెప్పినా వినరు. పైగా నవ్వుతారు. అంతేకాదు మన్ని అందరి ముందరా అనుమానం చేస్తారు. మొన్న నేను బాబాయి వరస గురించి పెద్దవాళ్ళతో మాట్లాడుతున్నానా. అంతట్లోకి మా అమ్మ వచ్చేసి 'బొబ్బోసు కుందుగాని దామ్మా బుడుగూ' అని రెక్కపట్టుకుని బరబరా లాక్కుపోయింది. అది అనుమానం చెయ్యడం కాదూ. నేను హాచ్చర్య పడిపోయేశాను.

ఎవళ్ళేనా సరే నన్ను కనక అనుమానం చేస్తే నాకు ముందస్తుగా హాచ్చర్యం వేసేస్తుంది. ఆనక, కోపం వచ్చేస్తుంది. మా అమ్మ, బామ్మా మరీను. "బుడుగూ బొబ్బ పోచుకుందుగాని లా అమ్మా" అనీ "బువ్వ పెత్తనా బులుగూ" అనీ అంతాలు. నేను పదిసార్లు చెప్పాను. చిన్న వెధవలకీ చితక వెధవలికీ చెప్పినట్లు అలా బొబ్బా, బువ్వా అని నాతో అనొద్దని. స్తానానికి లేవరా అనీ, భోం పెట్టుతాను రారా అని పిలవాలని చెప్తానా, వాళ్ళు నవ్వేస్తారు. ఒక్కోసారి ఇంటికి పెద్దాళ్ళొచ్చినపుడు కూడా నన్ను కుర్రాణ్ణి కింద కట్టేసి అనుమానం చేస్తారు.

నా వైస్సు గురించీ అంతే. నాకు ఇప్పుడు ఏడేళ్ళు.

ఎవళ్ళేనా అడిగితే మా అమ్మేమో ఆరేళ్ళండీ అని అబద్ధం ఆడేస్తుంది. మా బామ్మేమో యెబ్బే, యేదీ నాలుగు వెళ్ళిందిగాని అయిదోయేడాది యింకా రాందే అని డబాయిస్తుంది. బాబాయి ఒక్కడే బెస్టు. నాకు ష్టదేళ్ళుంటాయని చెప్తాడు లోకులతో.

లోకులంటే కాకులు. ఇలా అని బామ్మ అంటుంది. బాబాయి ఫ్రెండ్లందర్నీ బామ్మ కాకుల్లా ఎండలో తిరుగుతారని కోప్పడుతుంది. అందుకు.

ఇందాకళ చెప్తున్నది అనుమానం చెయ్యడం గురించి కాదూ.

ఏం, మరీ అమ్మ ఆవేళ అలా నన్ను రెక్కట్టుకు తీసుకుపోయిందా, నాకు ఒళ్లు మండిపోయింది. 'ఇంసల్టు' అన్నాను.




(ఇంసల్టు అన్నా కూడా అనుమానం చెయ్యడమేట – ఇది ఇంగ్లీషు. బాబాయి ఈ మాటని బామ్మ కోప్పడ్డప్పుడు అంటాడు).

అమ్మ నవ్వడం మొదలెట్టింది. నాకు బోల్డు ఖోపం వచ్చేసింది. బొబ్బ పోచుకోను అన్నాను వెక్కిరిస్తూ. అప్పుడు అమ్మకీ కోపం వచ్చేసింది. వచ్చేసి ఉత్తి బొబ్బ అల్లా మార్చేసి, తలంటి పోసేస్తా నుండు అంది. అని నిజంగా తలంటి పోసేసింది. (అప్పుడు నాకు బోడిగుండు ఉండేదనుకో).

నేను అప్పటికి ఏడిచినా, ఆ తరువాత, అమ్మ ఇంకోసారి గసురుకున్నప్పుడు అమ్మని కోప్పడేశాను. ఎవళ్లు మాత్రం ఊరుకుంటారు కోప్పడక. మహామహ చిన్నవాళ్ళే ఊరుకోరు. ఊరుకుంటే ఇంకా లోకువ కట్టేస్తారు. లోకువ కట్టడం అంటే అర్థం తెలుసుగా. నాకు తెలీదు.

మా అమ్మ ఒక్కోసారి కోపంగా ఉన్నప్పుడు నాన్నని ముందస్తుగా గసురుతుంది. తరువాత, కుంచెం ఏడుస్తుంది. అదన్నమాట.

యేం. ఇందాకా తలంటికి ముందు యేదో చెప్తున్నానుగదూ బాబాయి వరస గురించి? నేను పెద్దవాణ్ణి అవుతున్న కొద్దీ గ్నాపకం గబగబ రావటంలేదు.

బాబాయి వరస ఏమిటంటే, అసలు బాబాయి, సీత ఒక వరసగా కూచుని చదువుకోరు. నేను, మా ప్రైవేటు మేష్టరూ ఎదురుగా కూర్చుంటామా. వీళ్లు అలాగ కూర్చోరు. అందుకే బామ్మ వాళ్ళ వరస బాగులేదంది. నేనూ అలాగే అనుకున్నా.

అనుకుని బాబాయి గదిలోకి వెళ్ళి, మీ వరస బావులేదని నా అభిప్రాయం అని చెప్పేశా.

# బాబాయి వరస




యేడిశావులేవోయ్ బోడివెధవా బోడి అభిప్రాయం నువ్వూనూ అనేశాడు బాబాయి. అనేసి నా గుండుమీద ఓ టెంకిజెల్ల పుచ్చుకున్నాడు. సీత పకపకా నవ్వేసింది.

బాబాయికి అసలు నేనంటే కృతఘ్నత లేదు. కృతఘ్నత అంటే, ఏమిటంటే –

మీ బాబాయి ఓ కాలేజీ పిల్లాడనుకో. ఆడపిల్లల కాలేజీలో ఓ అమ్మాయి బావుంటుందనుకో, (మనక్కాదు, మీ బాబాయికి) అది రెండు జడలు వేసుకుంటుందనుకో. అది మా వీధిలోంచే కాలేజీలకి వెళ్ళాలిగదా రోజూ.

మా బాబాయి ఆ వేళకే ఎదురుగుండా మొగ కాలేజీవేపు వెళ్తాడు. అప్పుడు చూసి నవ్వుతాడు కళ్లజోడులోంచి. అంటే కళ్లజోడులోంచి నవ్వడు. చూస్తాడన్నమాట.

యేం ఒక్కోసారి వంట అవలేదనుకో. కలకత్తా రయిలులాగ బాబాయి లేటు అవుతాడు. ఆ జడల పిల్లమాత్రం చప్పునే వచ్చేస్తుంది. అప్పుడు బాబాయి దాన్ని చూడ్డం ఎలా? వీ ధరుగుమీద కూర్చుంటే, నాన్న ఏరా ఇక్కడ కూర్చున్నావు అంటాడు. అమ్మ కూడా నవ్వుతుంది. అప్పుడు బాబాయి సిగ్గుపడతాడు. అందుకని, ఏమిటంటే, నన్ను వీధరుగుమీద ఉండమంటాడు. ఆ పిల్ల వస్తున్నప్పుడు పరుగెత్తుకు వచ్చి చెప్తే తను వచ్చేస్తాడన్నమాట.

ఇది చాలాకష్టం. ఇప్పుడు కొన్ని కార్లున్నాయనుకో అవి ముందర వేపూ వెనకాతలవేపూ ఒక్కలాగే ఉంటాయి. అందుకని దూరంనుంచి చూస్తే అలాటి కార్లు ఇటు వస్తున్నాయో అటు పోతున్నాయో గబుక్కున తెలీదు.

ఈ జడలమ్మాయీ అంతే. రెండు జడలు కదూ. ఓటి ముందరికీ ఓటి వెనక్కీ వేసుకుంటుంది. అందుకని వొస్తోందో పోతోందో తెలీదుగదా దూరానికి.

యిలా ఓ రోజున నేను కష్టపడి చూస్తూ అరుగుమీద కూచున్నా. యింతట్లోకి ఆ పిల్ల రైయ్‌మని రైలుబండిలా వచ్చేస్తోంది. నేను లోపలికెళ్లి బాబాయికి చెప్పి పిల్చుకొచ్చే సరికి ఇల్లు దాటిపోతుంది కదా అని, ఆ పిల్లనే ముందుపిల్చి కుంచెం అక్కడే ఉండు అని చెప్పి లోపలికెళ్ళా.

బాబాయి రాడే. రోడ్డు మీద నించుందీ, రా బాబాయ్ అని చెప్పినా రాలేదు. పైగా అరవకు బోడివెధవా అని టెంకి జెల్ల కొట్టాడు.









ఇదే కృతఘ్నత లేదంటే అర్ధం.

యేం ఆ వేళ అలా బోడివెధవా అన్నాడా. మొన్ననూ, మీ వరస బాగులేదంటే, బోడి అభిప్రాయం అని మళ్లీ అన్నాడా.

బాబాయి అలా నాది బోడి అభిప్రాయం అనడానికి నాకు బోడిగుండు ఉండడమే గదా ఫలితం అనుకున్నాను. ఆ ఫలితంవల్ల కోపం వచ్చేసింది. ఫలితం అంటే కారణం. అంటే నాకు తెలీదు.

ఈ అభిప్రాయం నాదికాదూ, బామ్మదిలే అని చెప్పేద్దామనుకున్నాను. కాని, ఏం లాభం, నాకు కొంచెం పిలకేనా ఉంది. బామ్మకి పిలక కూడా లేదు అందుకని ఊరుకున్నాను.

అయినా కోపం వచ్చేసింది. ఈ అన్నింటికీ ఈ బోడిగుండూ, పిలకాయేకదా ఫలితం అనుకుని, వెంటనే నాన్న కోటుజేబులోంచి ఓ కాణీ తీసుకుని నా బండీ కొరడా (నిఝంకొరడా తెలుసునా) పట్టుకుని రయ్‌మని వెళ్ళిపోయాను. ఎక్కడికి?

మెడ్రాసు క్రాపింగుషాపు అని ఓటుంది పక్కవీధి చివర.

మాది ఇదివరకు మెడ్రాసేగా. దసరాకి వెళ్ళాంలే – పది రోజులున్నాం.

అక్కడికివెళ్ళి, నాకు అర్జెంటుగా మెడ్రాసు క్రాపింగుషాపు చెయ్యమన్నాను.

వాడు రండి అని మర్యాద చెయ్యలేదు. పైగా మీ నాన్నని అడిగి రమ్మన్నాడు. ఇలాటి వాట్లో నాన్న ఎప్పుడూ అమ్మ పార్టీయే. అందుకనే అడగలేదనుకో.

మా నాన్నంతవాడు వాడూ, నా అంతవాడు నేడూ, అందుకని ఫరవాలేదూ మెడ్రాసూ క్రాపింగుషాపు చేసెయ్యి అన్నాను.

వాడు ఓలా నవ్వాడు. అలా నవ్వితే నాకు కోపంవస్తుంది. నీకేనా సరే.

అక్కడికీ నా దగ్గిర డబ్బు లేదనుకుంటున్నాడేమోనని, కాణీ చూపించాను. ఇవ్వలేదనుకో. ముందస్తుగా డబ్బు ఇవ్వకూడదు. పెద్దవాళ్ళివ్వరు.

కాణీ చూపించినా వాడు మెడ్రాసు క్రాపింగుషాపు చెయ్యనన్నాడు.

యలాగా, నీది గుండుకదా అన్నాడు. అందుకే అర్జెంటుగా చేయాలి అన్నాను నేను.

చెయ్యకపోతే కొరడాతో కొతేస్తానన్నాను. వాడు చెయ్యలేదు. అందుకని ఛెళ్ళున ఓటిచ్చుకుని పరిగెరుకుని మా యింటికొచ్చేశా.




వాడూ స్ఫీడుగానే పరిగెడతాడు. నా అంత స్ఫీడు కాడనుకో.

అయినా పట్టేస్కొని కొఠేస్తాడని అవమానం కలిగింది.

అప్పుడు యింకో రోడ్లోంచి నిఝ్యం జటకాల చోటు కెళ్ళాను.

నాకు తెలీని వాళ్ళుంటారేమో చూద్దామని. తెలిసిన వాళ్ళ కన్న వీళ్ళే నయం. తెలిసిన వాళ్ళు నేను పిలిస్తే బండి కట్టరు.

అక్కడ ఒక్కడే కొత్తవాడున్నాడు.

మా యింటికి రావోయ్ అని బండి కట్టించేసుకుని రంయ్‌మని ఇంటికెళ్ళిపోయి, పెరట్లో కెళ్ళిపోయి జాం చెట్టెక్కి పోయాను.



తరవాత పెద్దవాళ్ళందరూ ఒకళ్ళకొకళ్ళు ప్రెవేట్లు చెప్పేసుకున్నారు. చివరకి నాన్నొచ్చి బాబాయికి గట్టిగా ప్రెవేటు చెప్పేశాడు.

క్రాపింగు వాడికి కోపం పోయేలా డబ్బులిచ్చాడు. అంతేకాకుండా బాబాయి వెంటనే ఓసారి క్రాపింగు చేయించుకోవాలన్నాడు. బామ్మ కూడా అంతేకావాలంది.

బాబాయి ఒద్దన్నాడు. పెద్దషాపుకెళ్తే కాని ఫాషన్‌గా చెయ్యరన్నాడు.

పోనీ ఇప్పుడు కుంచెం క్రాపింగు చేయించుకుని ఆనక పెద్దషాపుకి వెళ్ళమంది బామ్మ. అప్పుడేమో ఆ పెద్దషాపుకి, ఈ బండీమీద వెళ్ళచ్చునన్నాడు నాన్న.

కాని బండివాడు క్రాపింగు అయ్యేదాకా ఉండనన్నాడు. అంతట్లోకి క్రాపింగుషాపు వాడు అస్సలు నేను క్రాపింగు చెయ్యను పొమ్మన్నాడు.

అప్పుడేమో వాళ్ళిద్దరూ నేస్తాలయిపోయారు. క్రాపింగు షాపింగు వాడు, బండీవాడి జెటకాలో ఎక్కిపోయాడు. ఇద్దరూ ఆ బండిలో వెళ్ళిపోయారు.

ఆవేళ, మాయింట్లో అందరూ కలిసి ఒక్కసారి నా గుండుమీద ప్రెవేటు చెప్పేశారన్నమాట.

అందుచేత గుండు ఉండడం సుద్దదండుగ అన్న మాట. దండుగేమిటి డేంజరు కూడాను. ఉట్టిపుణ్యానికి మొట్టికాయలు కొట్టుతారు అందరూ.




అసలు దీనివల్ల అన్నీ డేంజరులే. అప్పుడు నాకు బోడి గుండనుకోండి. (నిజంగా ఇప్పుడు లేదనుకో. పూర్వకాలం ఉండేది). అంటే అందరూ టెంకిజెల్ల లిచ్చుకుంటారు. అప్పుడే నేను గారిగా వాళ్ళను కోప్పడేస్తాను. ఒక్కసారి నిఝం కొరడాతో కొరేస్తాను. అప్పుడు టెంకిజెల్ల కొట్టిన వాళ్ళే నన్ను పెంకి వెధవాయీ అంటారు. వీటన్నిటికీ ఫలితం గుండు ఉండడమే కదా.

## బోడిగుండు ఉండటం

ఇంకోటి. ఈ గుండు మనకి ఉంటేనే డేంజరు కాదు. ఎవళ్లకిఉన్నా డేంజరే. అన్నీ డేంజరులే.

ఇపుడు సంబరానికి మా నాన్నతో కలిసి వెళ్తామనుకో. అక్కడ గుండు ఉండేవాళ్ళు చాలామంది ఉంటారు. మా నాన్న మనని ఎత్తుకుంటాడు కదూ. అందుకని మనం ఎంచక్కా దగ్గిరికొచ్చిన ప్రతివాడి గుండుమీద ఓ మొట్టికాయో, అందకపోతే తేలిగ్గా ఓ జెల్లకాయో, కొడతాం గదా. కొట్టాలని కొట్టం – అలా కొట్టబుద్దేస్తుంది. నీకేనా సరే.

ఓసారి మా నాన్న నన్ను సంబరానికి తీసికెళ్ళాడు.

నన్ను ఎత్తుకోవద్దు సుమా. నా అంతవాడిని నేను అని నాన్నని ముందస్తుగానే బెదిరించాను.

బెదిరించడం అంటే ఏమిటి –

నాన్నెప్పుడేనా రోడ్డుమీద రెండుజెడల సీతలాంటిదాన్ని చూసి, బావుంది కదరా బుడుగూ, మెల్లిగా ఈల వెయ్యగలవా అంటాడనుకో. అప్పుడు నేను ఈలవేస్తే ఆ పిల్ల హుఁ అని ఇలా మొహంపెట్టి కోపంగా గబగబా వెళ్ళిపోయి, సందు చివర వెనక్కి తిరిగి నవ్వి మళ్ళీ వెళ్ళిపోతుందనుకో. ఆనకేమో నాన్న నన్ను ముద్దుపెట్టుకుని అమ్మతో చెప్పకేం అంటాడు గదా?

నాన్న ముద్దిస్తే అమ్మకి ఎందుకు చెప్పకూడదూ? అయినా నాన్న వద్దన్నాడుగా. అందుకని నేను చెప్తానంటాను కదూ. అదీ బెదిరించడం అంటే.

చెప్తే పళ్ళు రాలగొట్టేస్తానని నాన్న అంటాడు చూడు? అదికూడా బెదిరించడమే.

యేం? ఎత్తుకోవద్దని నేను ముందస్తుగానే బెదిరించినా, జనం మట్టేస్తారు వెధవా అని నాన్న నా మాట వినకుండా ఎత్తుకున్నాడు, సరే నాకేం అని, నేను దగ్గిరసా వచ్చిన వాళ్ళ నెత్తిమీద మొట్టికాయలు కొరేస్తున్నాను. ఎవళ్ళు కొట్టారో వాళ్ళకి తెలీటం లేదనుకో. కానీ, అంతట్లోకీ ఇంకో తళ తళా మెరిసిపోయే గుండువాడు దగ్గిరికి వచ్చాడు. వాణ్ణి నేను పూర్వం ఎరుగుదును

కాని, ఎప్పుడూ తలపాగా పెట్టుకునే కనబడేవాడు నాకు. అందుకని ఆయనికి అలాంటి గుండు ఉందని తెలీదు నాకు. మా నాన్నకీ తెలీదు.

నాన్నోయ్! చూశావా, వీడిది బోడిగుండు! అన్నాను హాచ్చెర్యపడిపోతూ.









నాన్న పకపక నవ్వేశాడు. నేనుకూడా నవ్వేస్తున్నాను. అంతట్లోకీ ఆయన ఆ యిరుకులోనే వెనక్కి తిరిగాడు. వాడు చాలా ఎత్తు. నాన్నకన్నాను. నాన్న నన్ను ఎత్తుకున్నంత ఎత్తు.

ఏమిటా పొగరు? ఎందుఖలా నవ్వుతారు అన్నాడు వాడు.

నా యిష్టం, నీ గుండుచూసి నవ్వొచ్చింది అన్నాను నేను.

ఛప్ నీతో ఎవడు మాట్లాడాడు అన్నాడు వాడు.

నేను నీ అంత ఎత్తున్నాను నాతోనే మాట్లాడావు అన్నాను నేను.

ఇంతట్లోకీ మా నాన్న ఛప్ ఊర్కోరా అన్నాడు.

అప్పుడు ఎదురుగుండా ఉన్న గుండువాడికి ఇంఖా కోపం వచ్చేసింది.

నన్ను చూసి నవ్వి, పైగా ఛప్ అంటావా అన్నాడు.

నిన్ను కాదు, మా అబ్బాయిని అన్నాడు నాన్న.

నన్నే అన్నాడు వాడు కోపంగా.

వాడు మా నాన్నకి ప్రెవేటు చెప్పేస్తాడని నాకు అనుమానం వేసింది. అందుకని నిజం చెప్పేశాను.

యేయ్! అబ్బీ మా నాన్న నిన్ను చూసి నవ్వాడూ, నన్ను ఛప్ అన్నాడూ అని చెప్పేశాను.

ఎందుకు నవ్వాలీ? అంటానూ అన్నాడు.

నేను నవ్వలేదు. నాకిదే పనా అన్నాడు నాన్న.

నీకేం పనో నాకేం తెలుసు? నువ్వు నవ్వావు అంతే అన్నాడు వాడు.

మా నాన్నకి రివినూ బోర్డులో పనీ అని చెప్పా నేను.

నా మాట యవళ్లూ వినలేదు.

నేను నవ్వలేదు అని అబద్దం చెప్తాడు నాన్న.

"నువ్వు నవ్వావు" అని నిజం చెప్తాడు వాడు.

యెలాగా? అంతట్లోకి నాకు మొట్టికాయ సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆ సందట్లో చటుక్కున ఒక్కటి కొట్టాను – వాడు అటుతిరిగి ఉన్నప్పుడు. ఆ వెనకాతల ఇంకో అబ్బి ఇంకో పిల్లాడ్ని ఎత్తుకున్నాడు గదా. ఆ పిల్లాడు నన్ను చూసి కాపీకొట్టాడు. అంటే ఓ మొట్టికాయ కొట్టాడు.

అంధరూ నవ్వేశారు. తరవాత యుద్ధం జరిగింది. దీనికంతా ఫలితం ఆయనకి గుండు వుండడమేగదా?

అలా అని పెద్ద క్రాపింగు ఉన్నా కష్టమేననుకో. గుండు ఉంటే ప్రైవేటు మేష్టరు ఒకదెబ్బ కొట్టేసరికి పారిపోవచ్చు. అదే క్రాపింగు ఉంటేనా. ముందస్తుగా జుట్టు గట్టిగా పట్టుకుని తరవాత చాలసేపు చితక్కొ్టేస్తాడు. ఒక్కోసారి ఇలా పైకి ఎత్తి పట్టుకుంటాడు.




ఇందాకా చెప్పానే సంబరంలో సంగతి. ఆవేళ నాన్న ఇంటికెళ్ళాకా కోప్పడ్డాడుగదా నా మీద.

ఎందుకు వాణ్ణి బోడిగుండు అనాలి అసలు? అంటూ. వాడికి నిజంగా గుండు ఉందిగా అన్నాను నేను.

ఏడిశావు. బోడినిజం నువ్వూను అని గసిరాడు నాన్న.

నాన్న ఇలా అనగానే ఎందుకో అమ్మకి నవ్వొచ్చింది.

వాడు చెప్పిన నిఝం దాన్ని గురించే గదా అంది.

అప్పుడు నాన్నకి నిఝం కోపం వచ్చింది. వేళాపాళా ఉండద్దూ నిజం చెప్పడానికి అన్నాడు.

ఇగో! నిజం చెప్పేస్తాను విను. నాకు ఇంత అనుభవం ఉంది గాని, ఈ నిజం అనేది ఎప్పుడు చెప్పాలో నిఝంగా బాగా తెలీదు.

ఒక్కోసారి మా యింట్లో అమ్మ మినపరొట్టె చేస్తుందా ఆదివారంనాడు?

సరిగ్గా తినడానికి టైమైనప్పుడే కొందరు మీసాలవాళ్ళు నాన్నతో మాట్లాడడానికి వచ్చేస్తారు. ఎంతసేపటికీ లేచి వెళ్ళరు. నాన్న వచ్చేదాకా అమ్మ నాకు రొట్టె పెట్టదు. ఆ రొట్టేమో చల్లారిపోతోంది. ఎలాగా?

పాపం అమ్మ విసుక్కుంటుందికూడా. పోనీ వాళ్ళకి పెట్టుదామంటే, మేం ముగ్గురం గదా అని కుంచెంగానే చేసింది మరి.

"కబుర్లు చాలు ఇంక ఇళ్ళకి ఫోండి" అని గసుర్తాను అనుకో – నా మాట ఖాతరు చెయ్యరు.

మినపరొట్టె చల్లారిపోతోంది. మీసాలవాళ్ళు ఎప్పుడు పోతారో అని నాలో నేనే (వాళ్ళకి వినబడేలా) విసుక్కుంటే, వాళ్ళు ఇలా మొహాలు పెడతారు. ఆనక నాన్న నన్ను పట్టుకుని మొట్టికాయ వేస్తాడు. నిజం అయితే మాత్రం అప్పుడెందుకు చెప్పాలని. మళ్ళీ నవ్వుతాడు కూడా.

ఇంకోసారీ ఇలాగే అయింది. నాన్న ఊళ్ళో లేడు. నాకు అర్జంటుగా డబ్బు కావల్సింది. అమ్మని అడిగానుగదా  అర్జంటుగా డబ్బుకావాలీ అని. ఏడిశావు లేదుపో ఇంట్లో అసలే ఇబ్బందిగా ఉంది అంది అమ్మ.

నాకు నాన్నమీద కోపం వచ్చేసింది. డబ్బు లివ్వకుండా ఊరెళ్ళి అమ్మని ఇలా కష్టపెడతాడా అని. సరే నాకూ  అర్జంటుగా కావాలిగా. లావుపాటి పక్కింటి పిన్నిగారి దగ్గర ఓ అర్ధణా అప్పు అడిగాను. ఓ కాణీ పెట్టి ఓ  బొంగరం కొని, మిగతా డబ్బులో బియ్యం బస్తా బొగ్గులూ అవీ కొందామని. ఆవిడ నామాట నమ్మదే. ముద్దిస్తావా అంది అర్ధణా సంగతి చెప్పకుండా. నాకు ఖోపం వచ్చేసింది. నిజెం చెప్పినా లోకులు నమ్మరుగదా అని. లోకులు -- అంటే పిన్నిగారూ వాళ్లూనూ.



కాని నేను చెప్పింది నిజం కాదుట. అమ్మదగ్గర డబ్బులు ఉన్నాయట. ఉత్తినే అంది లేదని.

లేదు అంటే ఇవ్వనని అర్థం అన్నమాట. అని అప్పుడు తెలిసింది. ఈ అమ్మ మాటలు ఘబుక్కున అర్థం అవవు.

అంతెందుకు. అమ్మ పేరు రాధ కదా. నాన్న రాధా అంటాడు. ఒక్కోసారి పిల్లా అంటాడు. అంటే నవ్వుతుందా, నేను అలా పిలిస్తే ఛప్ వెధవకానా అంటుంది కోపంగానూ, నవ్వుతూనూ.

ఓసారేం బలేగా అయిందిలే.

నాన్నేంచేశాడంటే – అదికాదు, ముందస్తుగా అమ్మ వంటింట్లో వంట చేస్తోంది. నాన్న ఏంచేశాడంటే తలుపు  దగ్గర దాంకుని, అచ్చంగా నాలాంటి గొంతుకతోటే, "పిల్లా వంటయిందా" అన్నాడు. అనేసి నవ్వుతూ వంటింట్లో  కెళ్ళాడు. అమ్మ అటువేపు తిరిగి ఉందిగా. చూళ్ళేదు. నేనే అనుకుంది.

ఆపళంగా, "వెధవకానా ఏమిటా ఫొగరు!" అంటూ గిర్రున ఇటు తిరిగింది. తిరిగితే ఇంకేముంది. హాచ్చెరం! అక్కడ  నేను లేను, నాన్న ఉన్నాడు. అయితే, నాన్న ఇందాక నవ్వుతున్నాడు. ఇపుడు హాచ్చెర్యపడి పోయేస్తున్నాడు.

అప్పుడు అమ్మకి కోపం వచ్చేసింది. "బావుంది, మంచీ చెడ్డా లేకుండా ఏమిటా సరసాలు" అంది. సరసాలంటే  నాకు తెలీదు.

నాన్న నవ్వేసి, అమ్మ పక్కనే కూచుని, నువ్వు పిల్లవికావా అన్నాడు. అయినా అమ్మ నవ్వలేదు.




ఛ. నోట ఎలాటిమాట లొచ్చాయమ్మా అంది మెల్లిగా.

అంతట్లోకీ అమ్మ కళ్ళలోంచి మెల్లిగా నీళ్ళు వచ్చాయి.

అమ్మ ఏడుస్తోంది. మా అమ్మని నువ్వెందుకు కోప్పడ్డావు అని నాన్నని కోప్పడ్డాను నేను.

అబ్బే అమ్మ ఏడవటం లేదు. ఉల్లిపాయలు తరుగుతోంది కదూ. అందుకూ అన్నాడు నాన్న అమ్మకి కళ్ళు తుడుస్తూ

కాని అక్కడ అస్సలు ఉలిపాయలు లేవు!

అక్కడ ఉల్లిపాయల్లేవు అన్నాను నేను.

నాన్నకి కోపం వచ్చింది. నేను నిజం చెప్పినా సరే హుఁ అన్నాడు కోపంగా.

అందుకే నిజెం ఎప్పుడు చెప్పాలో నాకు నిజెంగా తెలీదన్నాను, నన్నడిగితే నిజెం ఎప్పుడూ చెప్పకూడదు.

ఎప్పుడూ అంటే, అస్సల ఎప్పుడూ నిజెం చెప్పకూడదని కాద అస్తమానం ఎప్పుడూ అని అర్థ అన్నమాట.




ఇప్పుడు నేనున్నానా, బాబాయి ఉన్నాడా. బాబాయీ నేను ఎప్పుడేనా అలా షైరు వెళ్ళామా. అక్కడ ఇంకొందరు ఆష్టలు కుఱ్రాళ్ళు ఉంటారా. అప్పుడు రెండుజడల అమ్మాయో, ఒక్కజెడల అమ్మాయో రోడ్డుమీంచి నడిచి వెళ్ళిపోతోంది. గదా.

అప్పుడు ఈ బాబాయీ వాడి ఫ్రెండ్సూ ఈల వెయ్యాలిగదా. వాళ్ళకి పాపం రాదుగదా. అప్పుడు నన్ను ఈలవేసి పెట్టమంటారు.

నేను ఖయ్యమని ఈలవేస్తా. నాకు బాగా వచ్చు. రౌడీలదగ్గర నేర్చుకున్నానులే. రౌడీలు లు కాలుస్తారు. నేను కాల్చననుకో. అయినా నా దగ్గిర కుంచెం వున్నాయి. జెటకాబండితోలినప్పుడు చెవిలో పెట్టుకోవాలిగా అందుకు.

బీడీలు ఇంకోందుకు కూడా మంచివి. అమ్మ లేనపుడు బామ్మదగ్గిరికి వెళ్ళి మీద పడేస్తానంటే, కాణీ ఇచ్చేస్తుంది. అందుకు.

యేం, అప్పుడు నేను యీలవేస్తే బాబాయీ వాడి ఫ్రెండ్సూ కలిసి, ఓ కాణీయో ఫ్దణాలో ఇచ్చేస్తారు. ఇపుడు నేను ఆ కాణీయో ఫ్దణాలో పట్టుకుని ఇంటికి వస్తానా. అమ్మ నా జేబులు తమిడి ఎక్కడిదిరా బుడుగూ కాణీయో ఫ్దణాలో అంటుంది. తమిడి అంటే జేబులు వెతికి కాణీలు లాక్కోడం. అప్పుడు నేను ఆ కాణీ ఎక్కడిదో చెప్పాననుకో – కోరేస్తుంది. ఇంకెప్పుడూ అలాటి ఫని చెయ్యకేం జులాయి వెధవా అంటుంది. అందుకని ఓసారి నిజంచెప్పి మొట్టికాయిలుతింటే, రెండోసారి నిజం చెప్పకూడదు.

అయినా యీ పెద్దాళ్ళకి అన్ని గొడవలూ కావాలి. నేను మొగాడ్ని గదా, వీధిలోకి వెళ్ళి కాణీ సంపాదించుకువస్తే ఎక్కడిదీ అని ఎందుకు అడగడం. ఎందుకు మనచేత అనవసరంగా నిజెం చెప్పడం? మళ్ళీ కొట్టడంను? అందికే నాకు కోపం – అన్ని గొడవలూ వీళ్ళకెందుకని.

ఆఖరికి బాబాయి సీతకి లౌలెట్రు రాసినా వీళ్ళకే కావాలి. లౌలెట్రు అంటే నాకు తెలీదు. ఇవి బాబాయి దగ్గిర ఉంటాయి. బోల్డు ఉంటాయి. రాసి మళ్ళీ చింపేస్తాడు. మళ్ళీ రాస్తాడు.

యేం, ఓసారి బాబాయి ఈ లెట్రు (చూట్టానికి అచ్చు ఉత్తరంలా ఉంటుందిలే) నా చేతికిచ్చి, సీతచేతికిచ్చి రమ్మన్నాడు. నేను వెళ్ళేసరికి సావిట్లో సీత నాన్న కూర్చున్నాడు. వాడికెందుకు చెప్పు అన్ని గొడవలూను.




ఎవరికిరా ఆ ఉత్తరం అన్నాడు.

ఎవరికో నీ కెందుకురా అన్నాను నేను.

ఛడవా ఇలా రా అనేసి వాడు నన్ను గభుకుని పతేస్కు_న్నాడు. చేతిలో ఉత్తరం లాక్కు_చూశాడు. చూసి హూఁ అన్నాడు.

హేం పొగరు రాస్కెల్. నా కూతురికి ఉత్తరం రాస్తాడా? చెప్తా ఉండు అన్నాడు వాడు.

లేకపోతే నీకు రాస్తాడా అన్నాను నేను.

అసలు బాబాయి ముందరే చెప్పాడు. వాళ్ళ నాన్నకి చచ్చినా ఇవ్వద్దని. మరి వీడు లాక్కు_న్నాడుగదా. ఎలా, వీడు, మా నాన్న అందరూ కలసి బాబాయికి ప్రైవేటు చెప్పేస్తారని నాకు అవమానం వేసింది. జాలికూడా వేసింది. వీళ్ళమీద కాదు, బాబాయిమీద.

వేశాక, అప్పుడు ఒకలా అనుకున్నా. బాబాయిని రష్చించాలని.

నేను ఇలా అందర్నీ బోల్డుసార్లు రష్చింస్తాను. రష్చించడం అంటే కాపాడ్డం. అంటే నాకు తెలీదు.




అబద్దం చెప్తే ఎంత లాబం



యేం, సీత నాన్న ఆ ఉత్తరం పట్టుకుని ధాం ధూం అంటున్నాడు కదూ. అది లాక్కు_ పారిపోవాలనుకున్నా. కాని అందదే, వాడు చాలా ఎత్తుగదా.

ఓ సారి నన్నెత్తుకోవూ అని అడిగా.

ఛప్ నోర్ముయ్యి. నిన్నూ మీ బాబాయినీ కూడా చితక్కొ_ట్టేస్తాను అన్నాడు. అప్పుడు నేను కుంచెం దూరంగా నిల్చున్నాను.

బాబాయిని రష్చించడం ఇంకెలా--

అప్పుడు ఇంకో ఉపాయం వచ్చింది. ఉపాయం అంటే అబద్దం.

ఉరేయ్ సీత నాన్నా! మరేం, ఆ ఉత్తరం బాబాయి కాదూ. నేనే రాశా ఓచ్చి అనేసి పరిగెడు కెళ్ళిపోయా.

అయినా లాబం లేదనుకో. వాడు మాయింటికొచ్చేశాడు. అప్పుడు బాబాయి వంటింట్లో దాంకున్నాడు. నాన్నా వాళ్లూ సీత నాన్నతో మాట్లాడారు. తరవాత సీతకీ బాబాయికీ పెళ్ళిచేసేద్దాం అన్నారు. చివరికి నన్ను కొట్టారనుకో.

నేను ఇంకోసారి ఇలాగే నాన్నని రక్షించాను. నాన్న ఆవేళ అద్దం కిందపడేసి బద్దలకొట్టేశాడు, అమ్మ చూస్తే కోప్పడేస్తుందని భయపడుతున్నాడు.

అప్పుడు నేను అమ్మదగ్గిరకెళ్ళి అద్దం నేనే బద్దలుకొట్టానని అబద్ధం చెప్పేశాను. యలాగా నన్ను అల్లరివెధవా అంటారుగదా, ఇది కూడా నేనే చేశానంటే నష్టం యేమిటి?

అప్పుడు నాన్నేమో, అమ్మ చూడకుండా నన్ను ముద్దుపెట్టుకుని అర్ధణా కాణీ ఇచ్చేశాడు. చూశావా అబద్ధం చెప్తే ఎంత లాభమో. (అర్ధణా కాణీ అన్నమాట) అమ్మకూడా నవ్వేసి ముద్దు పెట్టుకుంది. మళ్ళీ పెంకిభడవా అంది.

యెందుకో మరి నేను మేలుకుని ఉన్నప్పుడు ఇలాగే తిట్టారు అందరూ. నిద్రపోతున్నపుడు నేను యెంతో ముద్దొస్తానుట మళ్ళీ యెంచాతో.

యెంచాతంటే యే చెప్తాం. అంటే యేం చెప్పలేం అన్నమాట. వీళ్ళు అన్నీ ఇలాగే మాట్లాడతారు.




ఇప్పుడేమో మనం నిద్దరోతున్నప్పుడు ముద్దొస్తాం అంటారా.

ఇలాగే నేను మెడ్రాసు క్రాపింగు దువ్వుకుంటే పండులా ఉంటానుట. కుంటకపోతే ఉండనుట. ఇంకా జులాయి భడవలా ఉంటానుట.

ఇలా అని అమ్మ చెప్తుంది. నాన్నకూడా చెప్తాడు (వాడు ఎప్పుడూ అమ్మపార్టీయేలే).

యేం? మరి అమ్మకూడా దువ్వుకుని జెడేసుకోవాలిగా. అప్పుడే పండులా ఉంటుందిగా.

అయినా ఒక్కోప్పుడు అమ్మజుట్టు రేగిపోయి ఉంటుందిగద పొద్దున్నే. అప్పుడు నాన్న కాఫీ తాగడానికి వస్తాడుగా వంటింట్లోకి.

అప్పుడు అమ్మ ఈ చేత్తో ఇలా కాఫీ ఇస్తుంది. ఇంకోచేత్తో ఇలా మొహంమీద జుత్తుని పైకి తోసుకుంటుంది చూడు. అప్పుడు నాన్న డేంజరులా మాట్టాడడూ.

ఆహా హాహా రాధా ఆ జుట్టు అలా ఉంచరాదా. అలాగే ఎంతో బాగున్నావుకదా అనేస్తాడు గదా.

యెందుకనాలీ అంట. అందుకే నాకు కోపం, నేను జుట్టు దువ్వుకోపోతే బాగులేదు అంటాడుగదా. అమ్మకి ఎందుకు అనడా? నాకు ఒకరూల్సు పెతేసి అమ్మకి ఇంకోరూల్సు మార్చేస్తాడు.

ఇలా రూల్సు మార్చేస్తే నేను హాచ్చెర్యపడిపోయేస్తాను. రూల్సు మార్చడం అంటే అన్యాయం చెయ్యడంట. అని బాబాయి చెప్పాడు. అన్యాయం అంటే నాకు తెలీదు.

వీడు లేడూ ఈ బాబాయి. వీడికి నాన్నపోలిక ఉంది.

ఈ బాబాయికి నేను ఏడిచినప్పుడు చూట్టానికి బావుంటుందిట. అందుకని ఒక్కోసారి, ఎవరూ లేకుండా నన్ను మొట్టికాయి కొరేస్తాడు. నేను యేడిస్తే చూడాలని.

నేను యాడవను అనుకో. పెద్దవాళ్ళు యాడవరుగా. అంతెందుకు లావుపాటి పక్కింటిపిన్నిగారి మొగుడుగారు లేడూ, వాడు ఏడిస్తే ముద్దొస్తాడేమో చూట్టానికని ఓ సారి మొట్టికాయ కొట్టా.

నా చెయ్యి నెప్పెట్టింది కాని వాడు యేడవడే. అందికని ఇంకోసారి రాయిబెడ్డ విసిరికొట్టా. అప్పుడు వాడుకాడు కాని నేను ఏడిచాను. వాడు ముందస్తుగా అబ్బ అనేసి, గభుక్కుని నన్ను పతేసుకుని నా క్రాపింగుమీద ప్రెవేటు చెప్పేశాడు – అందుకూ, వాడికీ ఏడుపొచ్చి ఉంటుందిలే.

అయినా, పెద్దవాడుగా అందుకని పైకి యాడవకూడదు.

అందుకనే బాబాయి కొట్టినా నేను ఎప్పుడేనాగాని యాడవను.

యేం? నాన్నకూడా అంతే. నాన్నకి నేను యేడిస్తే చూట్టానికి ఎలా ఉంటుందో తెలీదుగాని, అమ్మకి ఖోపం వచ్చినా యేడుపు వచ్చినా నాన్నకి నవ్వొస్తుంది. అప్పుడు అమ్మ బావుంటుందిట.

యవళేనా ఏంటే నవ్వరూ? అని నేను అంటే నాన్న ఏడిశావు లేవాయ్ నాగన్నా అంటాడు టెంకిజెల్ల పుచ్చుకుని.

ఇలాగే నేను ఏమేనా అడిగితే. నాన్నకి ఏం చెప్పాలో గ్నాపకం రాకపోతే ఏడిశావు అంటాడు. యెందుకంటే ఓసారి ప్రెవేటు చెప్పాడు. ఇది నిజం ప్రెవేటులే. యెప్పుడేనా చెప్తాడుగదా. ఏంరా బుడుగూ మనకి పాలిచ్చే జెంతువులు అయిదు చెప్పరా అన్నాడు.



ఐదు పాలిచ్చే జంతువులు

హాఁ ఇంత తెలీదనుకున్నావా అనేసి నేను చెప్పేశాను. కాని తప్పంటాడే.

నేనేం చెప్పానంటే, ముందస్తుగా ఆవు, గేదీ, చెప్పాను. తరవాత, చిట్టీ వాళ్ళు పట్టుకుని తాడుకి కడతారే – అదేమిటి? మేక.......మేక అని ఇంకోటి చెప్పాను.

ఆ తర్వాత రెండు ఆవులు అని చెప్పాను.

నాన్నా అమ్మా కూడా నవ్వేశారు. ఆవు ముందరే చెప్పావుగా ఇంకో రెండు కొత్తవి చెప్పాలి అన్నాడు నాన్న.

ఇంక లేవు ఫో అన్నాను నేను.

పోనీ మీరు చెప్పండి అంది అమ్మ. (అమ్మలు నాన్నల్ని మీరు అంటారులే చాలామంది)

నాన్న కుంచెంసేపు బుర్ర గోక్కుని గొర్రె అన్నాడు.

మర్రేనండోయ్ అంది అమ్మ. అనేసి ఊరుకుంది.

మరి ఇంకోటో? ఇంకో వేలుందిగా అన్నాను నేను.

నాన్న ఏడిసావు అని నన్ను కోప్పడేశాడు.

అంటే ఇంకో వేలుకి యేంచెప్పాలో తెలీదన్నమాట.

ఇలా అని అమ్మ అనేసింది కూడా. అనేసి నవ్వేసింది.

అప్పుడు నాన్న గబగబా బుర్ర గోక్కుని తెలీకేం బోల్డున్నాయి. జిరాఫీ, పులి, పిల్లి, కుక్క అన్నాడు.

అవన్నీ మనకు పాలిస్తాయా యేమిటి అంది అమ్మ ఇంకా నవ్వుతూ.

అపుడు నాకూ నవ్వొచ్చేసింది. నాన్నకీ నవ్వొచ్చేసింది. అందరికీ నవ్వొచ్చేసింది.

కుక్కంటే ఇంకోటి గ్నాపకం వస్తోంది.

ఆ లావుపాటి పిన్నిగారి మొగుడుగారు లేరూ? వాడేమో ఓసారి రోడ్డుమీంచి వెళ్తున్నాడు.

కాదు ముందస్తుగా ఓ కుక్క వచ్చింది. నేను దాన్ని మా యింట్లోకి రమ్మన్నాను పెంచుకుందామని.




అది రానంది. నేను తోక పట్టుకుని రమ్మన్నాను.

అప్పుడు వీధిలో వెళ్తున్న లావుపాటి పక్కింటి పిన్నిగారు ముగుడుగారు వచ్చారు. పిన్నిగారు కాదు: ముగుడు అన్నమాట.

వురేయ్ బుడుగూ అలా తోకని లాగకూ కరుస్తుంది సుమీ అన్నాడు – ఇలా బయంగా చూసి.

ఇంకెలా వీళ్ళతోటి, తోకెక్కడేనా కరుస్తుందా.

తోకని లాగితే, అప్పుడు కుక్కకి నెప్పి పెట్టితే మన్ని నోరుతో కరుస్తుందన్నమాట.

అలాగే మనకి జెటకా కొనుక్కోవాలని ఉందనుకో. నాన్నతో చెప్తే నాన్నంతట నాన్న కొనడు గదా. పోనీ దేముడిని అడిగితే వాడంతట వాడు ఇలా వచ్చేసి ఇదుగో బుడుగూ డబ్బులిందా, జెటకాబండీ కొని ఇంచక్కా తోలుకో అంటాడా?

మరి అనడుగదా. మరి ఎలాగా? అందుకే మనకి మూడు చెక్రాల సైకిలు కావాలనుకో. దేముడి దగ్గర నించుని చేతిలో వెన్నముద్ద చెంగల్వ పూదండ అని ముందస్తుగా పజ్జెం చదవాలి. ఆనక, ఓ దేముడూ నాకు జెటకా బండీ, కొరడా కొని పెట్టాలమ్మా అని కళ్ళు మూసుకుని గట్టిగా చెప్పాలి.




అప్పుడేమో మా బామ్మ వింటుంది. అమ్మ వింటే లాభం లేదనుకో.

అమ్మ వింటే నవ్వేసి, బుగ్గమీద గిల్లేసి, మహా అయితే ముద్దు పెట్టుకుని వెళ్ళిపోతుంది.

నాన్నకి వినపడినా లాభం లేదనుకో.

అందుకని బామ్మకి వినేలా చెప్పా దేముడికి. బామ్మకి మరి కుంచెం చెముడుకదా. అందుకని దేముడికి మరి కుంచెం గట్టిగా చెప్పాలి అందుకు.

నేను అలా చేస్తే బామ్మ నాకు ఓసారి బొంగరం, రెండుసార్లు గోళీకాయలూ కొనిచ్చింది.

నా దగ్గర గోళీకాయలూ చాలా లేవు. ఓ ప్ఫది కూడా లేవు. ఎదురుగుండా ఉన్న ఇంటిలో కుర్రాడి దగ్గర ప్ఫది ఉన్నాయి.




అంటే వాళ్ళ బామ్మ ప్ఫది గోళీకాయలు కొని పెట్టింది అని కాదు. వాడు నా దగ్గర గోళీలు రెండు కొరేశాడు. నిన్నో రేపో, ఇలాగే ఇంకోడి దగ్గర బెల్లించి, డబాయించీ లాక్కున్నాడు. అందుకే.

బెల్లించడం అంటే, నువ్వు బంగారు తండ్రికదమ్మా, నువ్వు బాచాలకొండవి కదమ్మా అనేసి మనదగ్గర బొమ్మలూ, జంతికలూ, గోళీలూ, నా వుండీలో వుండే డబ్బులూ అవన్నీ లాక్కోడం అన్నమాట.

మనం ఇవ్వను అంటాం అనుకో – అప్పుడు ఘుబుక్కున బోడివెధవా అని తిట్టడం.

అప్పుడు కూడా ఇవ్వకపోతే అల్లదుగో కాకి అటుచూడు అనేసి, మనం అటు చూస్తూ వుంటే, తీసేసుకుంటారు.

దీన్ని టోకరా అంటారని బాబాయి చెప్పాడు. టోకరా అంటే కూడా అబద్ధం చెప్పడమే. అంటే, ఇప్పుడు నా దగ్గర వుండి వుంది కదా, అందులో డబ్బులు వుంటాయి కదా. డబ్బులుంటే

వుండీ బరువుగా ఉంటుంది. లేకపోతే తేలికగా ఉంటుది. చప్పుడు అవదు. ఒక్కోసారి కుంచెం కాణీలు వుంటే, చప్పుడు అయినా, బళువుగా వుండదుగదా.

నా వుండీ వుండుండీ తేలికగా అయిపోతుంది. ఇది ఎప్పుడంటే నాన్నకి జీతం రానప్పుడు అన్నమాట. అప్పుడు మనం ఎందుకు వుండీ తేలికగా వుందీ అంటా మనుకో.

ఏమో అంటుంది. అమ్మ. నాన్నకూడా ఏమో అంటాడు హాచ్చెర్య పడిపోయేస్తాను. కాని బాబాయి నిజెం చెప్తాడు. కొంచెం రోజులు అయ్యాకా అనుక్కో.

ఏమిటంటే, నాన్నదగ్గర డబ్బులు అయిపోతే, నేను నిద్దరపోయినప్పుడేమో, నా వుండీలలో డబ్బులు అప్పు తీసుకుంటారుట, మళ్ళీ డబ్బులొచ్చాక అందులో ఆ అప్పులు వేసేస్తారుట. అప్పుడు వుండీ మ్మళ్ళీ బళువుగా వుంటుంది.

ఏం? మరి బాబాయి ఇలా అని నాకు ముందస్తుగా ఎందుకు చెప్పడు? ఆలీసెంగా చెప్తాడు గదా.

ఇలా ఆలీసెంగా నిజెం చెప్పినా ఆబద్దమే అన్నమాట.

ఇలాంటి నిజెం ఎప్పుడేనా పెద్దవాళ్ళే చెప్తారు. చిన్నపిల్లలు ఆలీసెంగా నిజం చెప్పకూడదట. చెప్తే డేంజరు

డేంజరు అంటే, పిన్నిగారూ మా బామ్మా పోట్లాడుకోడం.

ఇప్పుడు పిన్నిగారుందికదా, ఆవిడకు పేద్ద జడలేదు కదా. అయినా, పేరంటంలో కూచుని అభద్దం చెప్పేస్తుంది. అప్పుడు పెద్దజడ ఉంటుంది అని అనుకో. అయినా అది నిజెం జడ కాదు. సవరం జెడ. నేను చూశానులే. ఆవిడ ఓసారి మా యింటి కొచ్చి అభద్దం చెప్పింది. నాది పెద్ద జడా, నిఝెం జడా అని.

ఇంకోటి. అమ్మజెడ పెద్దదికాదూ అంది కూడా. అని నవ్వింది.

అప్పుడు నాకు ఖోపం వచ్చింది. అమ్మని ఎందుకలా అనాలి అని. నిజెం చెప్పెయ్యాలని నిల్చున్నాను. పిన్నిగారు ఎంతసేపయినా నిజెం చెప్పడం లేదు. ఇంక ఆలీసెం అయిపోతుంది. మరి నేను ఒక్కోసారి చిన్న వెధవని గదా. అందుకని ఆలీసెంగా నిజెం చెప్పకూడదు.

అందుకని కొయ్ కొయ్ అన్నాను పిన్నిగార్ని చూసి.



అప్పుడు పిన్నిగారు నోర్ముయ్ అంది.

అప్పుడు నేను నీది నిఝెం జెడ కాదు. సవరం జెడలే అన్నాను. అప్పుడు పిన్నిగారు నోర్ముయ్ అంది. అమ్మ నా నోర్మూసేసింది. కాని బామ్మ మంచిది గదా.

బామ్మ పోట్లాడింది పిన్నిగారితోటీ అమ్మతోటీ. చిన్న వెధవని అలా గసుర్తారేమిటమ్మా అంటూను.

అసలు పిన్నిగారికి నేనంటే కోపం. కోపం అంటే భయం. నేను ఎప్పుడేనా వాళ్ళింటికెళ్తే తలుపేసేస్తుంది. నేను తలుపులోంచి వెళ్ళనుగా. కిటికీలోంచి వెళ్తాననుకో.

అప్పుడు చంపేస్తా అంటుంది నన్ను ఇలా చూసి.

ఏడిశావులే అనేసి నేను పారిపోతా. మళ్ళా నన్ను పట్టుకోలేక, వాళ్ళ ముగుడితో చెప్పుకుంటుంది. వాడికీ నేనంటే భయంలే. నేను కనబడితే, ఇలా నవేసి ఓ కాణీ ఇచ్చేస్తాడు.

నేనంటే చాలా మందికీ బయంట, మరి నేను మంచివాణ్ణే. ఎందుకనో.

అంతెందుకు, మానాన్నకీ, మా నాన్న ఆఫీసులో పనిచేసే వాళ్ళందరికీ నేనంటే బయమేగదా. వాళ్ళ మేనేజరు లేడూ, వాణ్ణి మా నాన్న వాళ్ళూ సాయంత్రం తిట్టుతారు గదా. అపుడు వాడుండడనుకో అక్కడ.

విగ్గులేని ఎముడు అని వాడికి పేరు. పెద్దమీసాలూ అవీ ఉంటాయి గాని, నిఝెం ఎముడిలా ఉండడు. నేను ఎముడిని చూశానులే – ఓ సినిమాలో.




బాగా లావుగా వుంటాడు. మీసాలు వాడూను. వాడికి గిరజాల విగ్గు ఉంటుందన్నమాట. పిన్నిగారి సవరం లాగ.

యేం? ఒకరోజున నాన్న ఆఫీసుకు తీసుకెళ్ళలేదూ. ఆవేళ ఈ ఆఫీసులో ఎముడు ఎలా ఉంటాడో చూద్దాం నాన్నా అన్నాను.

ఏడిశావు ఒద్దు అన్నాడు నాన్న.

కాని మరి చూడకపోతే ఎలా? అందుకని, ఆఫీసులో నాన్న చూడకుండా నేనే వెళ్ళాను. ఓ గదిలో కూచున్నాడు వాడు. వాణ్ణే చూస్తే అస్సలు ఎముడిలా లేడు. భయం వెయ్యలేదు.

వాడు నన్ను చూసి పిల్చాడు నవ్వుతూ. తరువాత బిస్కెట్టు పెట్టాడు.

అప్పుడు ఎముడంటే వీడు కాడు అనుకున్నాను. అందుకని వాడినే అడిగాను.

ఇక్కడ విగ్గులేని ఎముడు అని ఒడున్నాడట. ఎవడురా వాడు అన్నాను.

నేనేలే అన్నాడు వాడు నవ్వుతూ.

కొయ్.కొయ్. నువ్వు కావు. మా నాన్న ఇక్కడ సుబ్బారావు గాడూ ఇంకో తలపాగా వాడూ వాళ్ళంతా ఇక్కడ నిఝెం ఎముడున్నాడని చెప్పారే. అన్నాడు.

నేను మేనేజర్ని. అందుకని నేనే ఎముడుని అన్నాడు వాడు.

విగ్గులేని ఎముడంటే కూడా నువ్వేనా అన్నాను.

నాకు విగ్గు లేదుగా అన్నాడు వాడు.

ఎందుకు లేదు అన్నాను. నాకు బలే జాలేసింది. ఎముడికి విగ్గు లేకపోతే ఎలా మరి.

మా పక్కింటి పిన్నిగారి సవరం తెచ్చి పెట్టనా అన్నాను.

ఒద్దులే అన్నాడు వాడు.

నువ్వేనా మా నాన్నా వాళ్ళ ప్రాణాలను తోడేస్తున్నావుట అన్నాను నేను.

మీ నాన్నా వాళ్ళ్లా ప్రాణాలు అస్సలు పట్రారులే. తెచ్చినా గుప్పిట్లో పెట్టుకుంటారు అన్నాడు వాడు.

అప్పుడు నాకు అనుమానం వేసింది వీడు నిజెం ఎముడు కాడురా అని.

అందుకని తలుపు దగ్గరకెళ్ళి, మా నాన్నని గారిగా పిలిచి అడిగాను. నాన్నా వీడేనా విగ్గులేని ఎముడు అని.

అంతే. ఒకసారి నాన్నా వాళ్ళందరూ పరిగేరుకొచ్చేసి నా నోరు మూసేశారు.

వెధవా ఏమిటా వాగుడు అన్నారు. అంతట్లోకి ఎముడుకూడా వచ్చేశాడు తలుపు దగ్గిరికి.

మా నాన్న హడ్డిలి పోయాడు వాణ్ణి చూసి.

హేదో కుర్ర వెధవండి. వాడికి తెలీదు అన్నాడు నాన్న.

మరే అన్నాడు ఎముడు.

కాదు తెలుసు నేను పెద్ద వెదవనే అన్నాను నేను.

ఔను అన్నాడు ఎముడు.

సార్ సార్ వాడిమాట వినకండి అన్నాడు నాన్న.

ఏం వాడు పెద్దవాడని ఒప్పుకుంటే తప్పా అన్నాడు ఎముడు.

అది కాదండి. మీ సంగతి అన్నాడు సుబ్బారావు గారు.

నా సంగతేమిటి అన్నాడు ఎముడు.

మీరు విగ్గులేని ఎముడని ఈ కుర్రాడన్నాడు చూడండీ...... అది పెద్దవాళ్ళమాట విని కాదు అన్నాడు తలపాగా ఆయన.

మరే మరే. వాడికే తట్టి ఉంటుంది. మా వాడు రౌడీవెధవ అన్నాడు నాన్న.

నిజమే. అందుకే ఈ పిల్లాడు విగ్గు కొనిపెడతానన్నాడు అన్నాడు ఎముడు.

విగ్గిచ్చినా నువ్వు ఎముడిలా ఉండవు అన్నాను నేను.

మరేండి ఉండరు ఉండరు అన్నారు నాన్నా, తలపాగా వాడూను.

రైటే విగ్గుంటే విగ్గులేని ఎముడిలా ఎలా ఉంటాను అన్నాడు ఎముడు.

వుండరండీ అసలు మీరు ఎముడిలా ఉండరు. విగ్గుకొన్నా సరే అన్నాడు నాన్న.

మరే అసలు ఎముడుకీ మీకూ పోలికలు లేవు అన్నాడు సుబ్బారావు గారు.

ఎముడు నవ్వాడు. ఎముడి పోలికలు మరెవరికున్నాయట నాగ్గాక అన్నాడు.

అపుడేం జరిగిందో తెలుసా

వాళ్ళందరూ నావేపు తిరిగి ఇగో ఈ పెంకి భడవకి అనేశారు.

నిజంగా ఎముడంటే వీడనంట



అప్పుడు మేనేజరు, నాన్న అందరూ నవ్వేశారు. ఇంటి కెళ్ళాక అమ్మ కూడా నవ్వేసింది.

ఇప్పుడు సంకురాంతిరి వచ్చిందిగదా. బామ్మ సంకురాత్రి అంటుంది. బామ్మకి తెలీదనుకో. ఇంగ్లీషుకూడా రాదు బామ్మకి.

మరి నేను పెద్దాడిని అవుతే కలకటేరు అవుతాడు అంటుంది బామ్మ.

కలకటేరు అంటే యింగ్లీషు. అస్సలది కలట్‌కర్ అన్నమాట. బామ్మకి తెలీదనుకో. అందుకని కలకటేరు అంటుంది. యేం చేస్తాం.

యేం. ఇప్పుడు ఈ సంకురాతిరి అంటే బోగి. బోగి అంటే బోగి పళ్ళు పొయ్యడం.

కాణీలూ రేగిపళ్ళూ కలిపితే బోగిపళ్ళు అంటారు. అవి మన నెత్తిమీద పోసేస్తే మనం ఆ కాణీలు ఏరేసుకుని దాచేసుకోడం అన్నమాట.

పూర్వకాలంలో అంటే నా చిన్నప్పుడు కాదు, నీ చిన్నప్పుడు దంబిడీలు వుండేవిలే. ఇప్పుడు లేవుటలే.

బోగి మంచి పండుగ.

ఇలా అని బాబాయి కూడా చెప్పాడు. బాబాయికి బోగిపళ్ళు పొయ్యరనుకో. అయినా వాడికి ఒద్దుట కూడా.

అసలు సంకురాంతిరి అంటే బోగి కాదుట. బోగి అంటేనే సంకురాంతిరిట. ఇలా అని బాబాయి చెప్పాడు.

సంకురాంతిరి అంటే సుబ్బలష్మిమి, సూరీడు, సావిత్తిరి, వాళ్ళందరూ పొద్దున్నేనూ, సాయింతరమూనూ ముగ్గులు వెయ్యడం అని అర్థంట, గొబ్బిళ్ళు పెట్టి డాన్సు చెయ్యడంట.

అప్పుడు చూట్టానికి బాగుంటుంది. ఇది బాబాయి అభిప్రాయం.




వాడి దగ్గిర ఇలాంటివి చాలా వున్నాయని చెప్పానుగా, ఇవేకాదు. బాబాయి దగ్గిర అభిప్రాయాలూ, పిచ్చివేషాలూ, రంగుపువ్వుల చొక్కాలూ, సిగరెట్లూ, ప్వదణాలూ, ఫొగరుమోత్తనం, పోకిరీ గుణాలూ కూడా ఉన్నాయి. నాన్న ఇవన్నీ చూశాడుట. నేను చొక్కాలూ, సిగరెట్లు మాత్రం చూశాను. మిగతావి చూళ్ళేదనుకో.

సిగరెట్లు తెల్లగా ఉంటాయిలే. వీటిని బాబాయిలాటి కుర్రాళ్లు కాలుస్తారు. కుర్రాళ్ళే కాలవాలిట సిగరెట్లు. ఇలా అని బాబాయి చెప్పాడులే.

మరి నేను పెద్దవాణ్ణిగా. అందుకు కాలవను. నేను యింఖా పెద్దవాడయ్యాకా జెటకా బండియేనా రైలింజనేనా తోలుతానుగా. అందుకని బీడీలు దాస్తాననుకో.

యేం. మరి ఈ సంకురాంతిరి ఉందా. ఇది మెడ్రాసులో లేదు. మా నిజెంవ్వూళ్ళో వుందన్నమాట. కాని నిఝెంగా చెప్పాలంటే మాది మెడ్రాసే అనుకో. అసలు సంగతి చెప్తాను.

ఇప్పుడు వ్వూళ్ళో బోగిమంట వేస్తారు గదా. దానికి పిడకలు చాలవు గదా. మరి కుర్చీలూ, కాయితాలూ, అట్టలూ లేకపోతే ఎలా.

మరి మనింటో, మా నాన్న కాయితాలూ, మా నాన్న విరిగిపోయిన కుర్చీలూ అవీ బోగిమంటకి వేస్తే నాన్న చెంపలు వాయిస్తానంటాడు గదా.

అందుకని మా యింట్లో నాన్న కాయితాలకన్నా, విరిగిపోయిన పక్కింటివాళ్ళ కుర్చీలు బెష్టు. చిరిగిపోయిన పక్కింటివాళ్ళ పుస్తకాలూ కాయితాలూ కూడా బెష్టే.

బెష్టంటే మనకి ఇంచక్కా ఉండేది; ఇంకోళ్ళకి కోపం ఒచ్చేది. ఇలా అని బాబాయి చెప్పాడు.

ఏం? నేనిలా విరిగిపోయిన పక్కింటి వాళ్ళ కుర్చీలూ, అవీ రౌడీలకి చూపించి భోగిమంటలో వెయ్యమంటానా. అప్పుడు పక్కింటివాడు, వాళ్ళ పెళ్ళానికి చెప్తాడు. వాళ్ళ పెళ్ళాం మా నాన్న పెళ్ళానికి చెప్తుంది.

మా అమ్మ అప్పుడు నాన్న వినేలా నన్ను కోప్పడేస్తుంది. నాన్న అప్పుడు నన్ను బామ్మ వినకుండా చెంపలు వాయించేస్తానంటాడు. కాని బామ్మ వినేస్తుంది.

బామ్మకి అస్తమానూ చెముడు లేదుగా, ఎప్పుడేనా ఒక్కోసారి ఉంటుంది.

అప్పుడేమో బామ్మ నన్ను వెనకేసుకొచ్చి నాన్నతోటీ అమ్మతోటీ పోట్లాడుతుంది.

బామ్మ లావుగా వుంటుందిగా. అందుకని, నన్ను వెనకేసుకొస్తే నేను అస్సలు కనబడను.

కాని ఒక్క సంగతి ఉంది.

అది యిప్పుడే గ్నాపకం వచ్చేసింది.

అస్సలు బామ్మ లావుగా లేకపోయినా, మన్ని వెనకేసుకు రాకపోయినా నాన్నా అమ్మా నిఝంగా మన్ని కొట్టరు. కొట్టినా గట్టిగా కొట్టరు తెలుసా.

వాళ్ళు మంచివాళ్ళు, అందుకని.

మనం అంటే పాపం ఛాలా యిష్టం అందుకని.

ఇప్పుడు, అమ్మ నన్ను కొఠేస్తానందనుకో, నాన్న సన్నంగా ఉన్నా వెనకేసుకొస్తాడు.

నాన్న నన్ను హన్నా అని కోప్పడేస్తున్నాడనుకో. అప్పుడు అమ్మ చెంగుపట్టుకు నించున్నామంటే చాలు. మనకేం భయంలేదు. అమ్మ రక్షిస్తుంది.

యేం? ఒక్కోసారి అమ్మ, నాన్న ఇద్దరూ హూ అంఠారనుకో. అప్పుడు బామ్మ రక్షిస్తుంది.

ఇలాగ వాళ్ళందరూ నన్ను రక్షిస్తారు. నేనూ వాళ్ళని రక్షిస్తానసుకో.

ఒక్కోసారి నాన్న నిద్దర పోతున్నాడనుకో. అప్పుడు నాకు జాలేస్తుంది. పోన్లే పాపం అని అల్లరి చెయ్యకుండా వదిలేస్తాను.



అలాగన్నమాట.

ఇప్పుడు భోగిపండుగ గదా. నేను అల్లరి చెయ్యచ్చు. పండగప్పుడు మనం అల్లరి చేసినా యవళ్ళూ కొట్టరు, అందుకని,.

కాని, అందుకనే నేను ఆట్టే అల్లరి చెయ్యను. అల్లరి చేసినా యేం లాభఁ, ఆటే కోప్పడ్రు గదా.

అందుకని, పండుగప్పుడు మనం అమ్మనీ, నాన్ననీ కాస్త రక్షించాలి. ఎందుకంటే పండుగ గదా మరి.

పండుగ వచ్చిందని వాళ్ళు మనకి కొత్తబట్టలూ అవీ కుట్టించుకుంటారు. ఏదో ముస్తాబూ అదీ చేసి సరదాగా ఉంటారు. కాని ఒకటి – పోనీ అని మనం వూరుకుంటే, తలంటి పోసేస్తానంటారు.

దానికీ సరే అంటే, ఒళ్ళు నల్చుకో అని పేచీ పెడతారు.

పండగ కాబట్టి ఇలా వాళ్ళు కాస్త చాలా అల్లరి చేసినా మనం వాళ్ళని కొప్పడకూడదు.

యెందుకంటే, వాళ్ళు మంచివాళ్లు.

బామ్మకన్న, బాబాయికన్న, నీకన్నా, ఛాలా చ్ఛాలా ఎక్కువ మాంచ్చివాళ్లు. మనం తలంటిపోసుకుని వాళ్లకి దండం పెట్టి ముద్దివాలి. అదీ సంగతి.




నాకు భోఘిపండగ, బాబాయికి సంకురాంతిరి పండుగా బాఘా జరిగాయి.

కాని నన్ను అప్పరాబాసం చేసేసి కొన్నాళ్ళు బళ్ళో పెట్టేసారు రోజూనూ.

బాబాయిని రైల్లో పెట్టేసి మెడ్రాసు పంపించేశారు. ఎందుకంటే, బాబాయి సుబ్బలష్మి ముక్కు బావుంది అన్నాడుట. అందుకని.

మనం ఎప్పుడూ సుబ్బలష్మి ముక్కు బావుంది అనకూడదు.

బావులేదు అని కూడా అనకూడదులే. ఎందుకంటే సుబ్బలష్మి మన యింట్లో లేదుగా అందుకు.

మనింట్లో వుంటే మా నాన్న అనచ్చును. మా యింటో మా అమ్మ వుందికదా. అమ్మ ముక్కు ఇలా ఎత్తుగా నాలాగ ఉంటుందిగదా.

యేం మరి నాన్న ఏయ్ రాధా నీ ముక్కు బావుంది అంటాడు గదా. నాన్న అలా అన్నా సరే అమ్మ ఒక్కోసారి హూ పోదూ గోపాళం అని ఇలా కోప్పడేస్తుంది. గోపాళం అనదులే. ఫోండీ, అంటుంది అనుకో. అలా కోప్పడ్డా కుంచెం నవ్వుతుందిలే.

యేం. అందుకని బాబాయేమో సుబ్బులు ముక్కు బావుంది అంటే సుబ్బులికి కోపం వచ్చినా కుంచెం నవ్వింది గదా. అయినా వాళ్ల తాత విన్నాడు మరి.

అప్పుడు వాడు హఁయ్ అని ఖోప్పడ్డాడు గదా. అప్పుడు బాబాయి అభద్దం చెప్పేశాడు.

ఇక్కడ వేసిన రదం ముగ్గు బావుంది అన్నాను గాని ముక్కు కాదండీ అన్నాడు బాబాయి. అప్పుడు సుబ్బులు వాళ్ల గుమ్మంలో ముగ్గేస్తోందిగా. అందుకు.

అయినా వాళ్ళ తాతయ్య కోపంగానే వున్నాడు.




నువ్వు ముఖు అన్నావు అన్నాడు ఆ తాతయ్య

కాదు ముగ్గు అన్నాను అన్నాడు బాబాయి.

అప్పుడు సుబ్బులేమో ఇదిగో ఈ ముగ్గే బావుందన్నాడు అని చెప్పేసి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

అప్పుడు నాన్న వచ్చి బాబాయిని పిల్చాడు. అప్పుడు బామ్మ బాబాయికి ప్రైవేటు చెప్పేసింది. బాబాయి మెడ్రాసెళ్ళి పోతానన్నాడు.

చివరకి వీడే కారణం బోడివెధవా అని బాబాయి నన్ను తిట్టుతూ నెత్తిమీద టెంకిజెల్ల పుచ్చుకున్నాడు.

నేనేం చేశాను.

సుబ్బలక్ష్మికూడా ముక్కు కాదు ముగ్గు అని అబద్ధం చెప్పింది గదా అని నేను వెళ్ళి ముగ్గుకాదూ మరేమో మా బాబాయి ముక్కు అన్నాడు అన్నాను. నిజం చెప్పాలిగా మనం.

అప్పుడు అమ్మ, నాన్న, మంచిపని చేశావులే అన్నారు గాని-

నాకు గబుకున అక్షరాభ్యాసం చేయించేశారు.

ఈ వెధవాయిని బళ్ళో పడేస్తే కాని లాభం లేదు అనేశారు.

నేను అల్లరి చెయ్యనందుకు ఇదీ శిక్ష.

శిక్ష అంటే చిన్నపిల్లల్ని బళ్ళో పెట్టెయ్యడం అన్నమాట.

శిక్ష అంటే బాబాయిని మెడ్రాసు పంపించెయ్యడం అని కూడా అర్థంట. ఇలా అని బాబాయి చెప్పాడులే. కాని ఇది తప్పు.




అప్చరాబాసం ఏం కష్టంకాదులే. అన్నీ మనకి వచ్చినవే మళ్లీ అనమంటారు.

ఓ నా మ హా సి వా య హా సీ ధం నా మ హా ఇలాంటివి. అదంతా బావుంటుందిలే.

ఆవేళ నాన్న నేనూ విసినాధం కొట్టుమీద కెళ్లాం. విసినాధం కొట్టులో పలకలూ, పిప్పరమంటు బిళ్లలూ, గోలీకాయలూ, గాలిపడగలూ ఉంటాయి. మనం ఏం కావాలన్నా సరే ప్వదణాలు పట్రా అంటాడు.

నాదగ్గిర ఫదణాలు లేవు. మరి చిన్న పిల్లాడిని గదా ఎలా ఉంటాయి. ఇపుడున్నాయిలే. బోఘిపండగకి సంపాదించాను.

సంపాదించటం అంటే, చిట్టిగాడులాటి చిన్నపిల్లలికి రేగిపళ్లు ఇచ్చేసి వాళ్ల దగ్గిర ఫ్వదణాలు లాక్కు పారిపోడం. రేగిపళ్లు వద్దంటే, మొట్టికాయలు ఇచ్చి తీసుకోవచ్చులే.

యేం నాన్నా నేనూ యిన్ని అణాలూ కాణీలూ పట్టికెళ్లి, నాన్న దగ్గిర అణాలు విసినాధానికి ఇచ్చి, నావి దాచుకున్నాం.

విసినాధం పలకలిచ్చాడు.

నాన్న గట్టివేనా అన్నాడు.

గుండేసి పేల్చినా పగలవని విసినాధం చెప్పాడు.

అప్పుడు నేను యిలా నేలమీద వేసి కాలితో పేల్చానా, అప్పడంలా పగిలిపోయాయి గదా.

చూశావా ఎలా అభద్దం చెప్పాడో. అందికే వాడికి మూడు ఆడపిల్లలు.

అభద్దాలు చెప్తే ఆడపిలల్లు పుట్టార్త. నీకు తెలుసా? నాకు తెలుసులే. నిజం చెప్తే మొగపిల్లలు పుట్టార్త.

చాలా ఎక్కువ నిజం చెప్తే నాలాంటి పెంకి భడవలు పుట్టార్త. ఇలా అని చెప్పేడు.

పుట్టార్తడం అంటే, మనం ఎక్కడో దొరకడం అన్నమాట. అంటే దేవుడు మన్ని తెచ్చి మా యింటో పడేస్తాడు. అపుడు అమ్మా నాన్నా కుంచెం రోజులు పెంచుతారు. తరువాత పెంకి భడవా కానా బడుద్దాయీ అంటారు. అప్పుడు గబుక్కున అప్చరాభాసం చేసి బళ్ళో పెట్టేస్తారు.




బడుద్ధాయీ అనడం తప్పు. బుడుద్ధాయీ అనాలి. నాపేరు బుడుగు కదా అందుకు.

కాని, బళ్ళో చెవిటి మేష్టరుకి యిలా అని తెలియదు. ముందస్తుగా బడుగూ బంగారు తండ్రీ అన్నాడు.




కాదూ, బుడుగూ బంగారు తండ్రీ అని చెప్పానా.

ఆలా చెప్తే మేష్టరుకి ఖోపంవచ్చి ఇలా చెవి మెలిపెట్టేశాడు. బడుగూ బడుద్ధాయీ అన్నాడు.

అప్పుడు నాకు కోపం వచ్చేసింది. బాణంతీసి కోసేస్తాను అని చెప్పాను. మేష్టరు హడిలి పోయాడులే. బుడుగూ మంచివాడూ అనూ అన్నాను.

అప్పుడు మేష్టరు బుడుగు మంచివాడూ అని మూడుసార్లు అన్నాడు.



అప్పుడు భయపడ్డాడా, తరవాతెమో నాన్నతో వెళ్ళి చెప్పుకున్నాడు.

అప్పుడు నాన్న నాకు ప్రైవేటు చెప్పేశాడు.

కాని మేష్టరుకి నేనంటే బయమే.

బయం అంటే, మన్ని అస్తమానూ కొట్టడం.

అలా కొట్టకపోతే మనం అల్లరి చేస్తామని భయం. అదీ సంగతి.



మేష్టరేమిటిలే. బళ్ళో పెంకిపిల్లలికి కూడా నేనంటే భయమే. నేనొస్తే చాలు పలకపుల్లలూ, గోళీకాయలూ అన్నీ దాచేసుకుంటారు. అస్సలు అల్లరి చెయ్యరు.

నాతో "గుడుగుడు గుంచం గుండారాగం పాములపట్టం పడగారాగం కత్తేనా బద్దేనా వేన్నీళ్ళా చన్నీళ్ళా" ఆట ఆడడానికి గూడ రారు. ఆడితే ఠక్ ఠక్ మని కొఠేస్తానుగా అందుకని. ఇలా బయపడిపడి ఓ ఫదిమంది బడిమానేశారు. అప్పుడు మూ్డ్రోలో ఫదిరోలో పోయాక, నన్ను బడికి వెళ్ళద్దన్నాడు నాన్న. మేష్టరుకూడా ఇప్పుడప్పుడే రావద్దు అన్నాడు. నేనే మీ యింటికి వస్తాను అన్నాడు.

కాని, మూ్డ్రోలో ఫదిరోలో అయ్యాకా, నాన్నా అమ్మా నేనూ మెడ్రాస్ వెళిపోయాం. మెడ్రాసేగా మా అస్సలు నిజెంవూరు అందుకు.



మా అబద్దం ఊళ్ళో చిట్టిగాడూ వాళ్ళూ నాతో వస్తామన్నారు మెడ్రాసు. నేను వాళ్లకి ఉత్తుత్తి టిక్కెట్లిచ్చాను ముందు. కాణీకి రెండు పెట్టి కొనుక్కున్నారు.

తరవాత మా నాన్నకి వాళ్ళని చూపించి యింకో పది టికెట్లు కొనమని చెప్పాను మెడ్రాసుకి.

కాని పాపం నాన్న దగ్గిర చాలా కాణీలు లేవుగా. అందుకని కొంటానని అబద్దం చెప్పాడు.



నాకో టిక్కెట్టూ అమ్మకో టిక్కెట్టూ కొన్నాకా, డబ్బులు అయి పోయాయి. అందుకని నాన్నకి అర టిక్కెట్టుకొన్నాడు. అర టిక్కెట్టు అంటే ఇలా చింపి చిన్న ముక్క యిస్తారులే..... యింకా నా సామానులు బండిచక్రం., గులకరాయిలూ, గోళీకాయిలూ, విరిగిపోయిన పక్కింటి పిన్నిగారి రేకు పెట్టే, వాళ్ళ ముగుడుకోటూ, కళ్ళజోడూ (అద్దాలేమో వాళ్లింటోనే పారేశానులే. మనదగ్గిరుంటే యెలాగా విరిగిపోతాయికదా!) అవన్నీ యెలా తేవడం.

ఇక్కడే వుంచెయ్యి, అవన్నీ బూడుసురైల్లో వస్తాయీ అలా అని చెప్పాడు నాన్న. కాని, నాన్నకేం తెలుసు. అలాటివి బూడ్సు రైల్లో వేస్తారా.

అందుకని, నేనే నాన్నకి చెప్పకుండా, వాడిపెట్లో నా సామానులు సర్దేసి, నాన్న కోట్లూ పుస్తకాలూ అవన్నీ బోషాణంలో దాచేశా ననుకో.

కావలిస్తే అవే బూడుసు రైలు వస్తాయి. బూడుసురైలు మెల్లిగా పరిగెట్టుతుందిట. మెడ్రాసు రైలు గబగబ పరిగెట్టుతుంది.

ఇప్పుడు బాబాయి, నేను షికారు వెళ్తాం గదా. అప్పుడు సుబ్బలష్మి వాళ్ళ వీధిలో వుంటే బాబాయీ నేనూ బూడుసురైల్లా వెళ్ళాలిట. ఇలా అని బాబాయి చెప్పాడు.

యేం? అంతట్లోకే సుబ్బలష్మి తాతయ్య వీధిలోకి వచ్చాడు గదా. అప్పుడు మేం మెడ్రాసురైల్లా పరిగెరుకెళ్ళిపోతాం. అదన్నమాట.

యేం. మేం ఝూమ్మని జెటకాఎక్కి రైలుదగ్గిరి కొచ్చాం గదా. అప్పుడే నన్నమాట నేను పోలీసు వాడితో మాట్లాడేశాను.

కొంచెం డేంజరే అనుకో పోలీసుతో మాట్లాడం. కాని మనకి ధైర్యం ఉండాలిగా.

ధైర్యం అంటే పోలీసుతో మాట్లాడం అని అర్థం.

ధైర్యం అంటే సుబ్బలష్మితో మాట్లాడం అని కూడా అర్థంట, ఇలా అని బాబాయి చెప్పాడు.

ధైర్యం అంటే బుడుగ్గాణ్ణి బజారుకి తీసికెళ్ళడం అనికూడా ఇంకో అర్థం ఉందిట. నాన్నకి ఇలాంటి ధైర్యం లేదు. ఇలా అని అమ్మ అంటుంది.

కాని, అస్సలు రైటు ఏమిటంటే పోలీసుతో మాట్లాడ్డమే. మీసాల పోలీసుతో మాట్లాడితే ఇంకా గొప్ప గదా. నేనోసారి నాన్న ఎత్తుకున్నప్పుడు ఓ పోలీసుని టైమెంత అని అడిగేశా.

టైమెంతంటం అంటే నాకు తెలీదు. ఏం, ఆ పోలీసు వినలేదనుకో.

రైలుదగ్గిర ఎందుకు మాట్టాడానంటే, మా నాన్నని రక్షిద్దామని. మరి మా నాన్న అరటిక్కట్టు కొన్నాడుగా, ఒకవేళ నాకోసం ఏమోనని అడిగితే, నాన్నకేనని అమ్మ చెప్పింది. కాదూ, అమ్మకోసం అని నాన్న చెప్పాడు. యలాగేనా డేంజరని అనుమానం వేసింది నాక్కూడా. అందుకని పోలీసునే అడిగేశాను. అసలు బుడుగుకి టిక్కట్టు కొన్నారా అని అడగండి పోలీసువాడూ అని చెప్పేశా.







పోలీసువాడు మంచివాడే. నన్ను ఇలా ఎత్తుకుని ముద్దు పెటేస్కున్నాడు. నాక్కోపం వచ్చింది. కాని ఊరుకున్నాను. పోలీసుగదా అని. అపుడు వాడు నాన్నని అడిగాడు బుడుక్కి టిక్కెట్టు కొన్నారా అని.

కొన్నానని నాన్న చెప్పాడు.

అప్పుడు రైలొచ్చింది.

నాన్నేమన్నాడంటే అమ్మని ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కిపొమ్మన్నాడు.

నాకు బలే బయం వేసింది. అమ్మకి కూడా బయం వేసింది. ఎందుకంటే, ఆడవాళ్ళ పెట్టెలో అందరూ పోట్టాడతారు. ఎవళ్ళూ చోటియ్యరు. జరగమంటే జరగరు.

నేను ఎక్కను బాబూ అంది అమ్మ.

నేను పరిగేరుకుని ఇంజిను డ్రైవరు దగ్గిర కెళ్ళిపోయా.

ఫది బీడీలిస్తాను నన్ను రైలు తోలనిస్తావా అన్నాను. కాని వాడిదగ్గిర ఛాలా సిగరెట్టులే వున్నాయి.

అందుకని బీడీలు ఒద్దన్నాడు. మీ అమ్మదగ్గిరి కెళ్ళిపో అన్నాడు.

చివరికి ఏంచేస్తాం. నేను కూడా అమ్మతో ఆడాళ్ళ పెట్టిలో ఎక్కిపోయాం.

హబ్బబ్బ. ఈ ఆడాళ్ళు ఉత్తప్పుడు మంచివాళ్ళేగాని, రైల్లో బలేచెడ్డవాళ్ళులే.

మనం వెళ్తామా మనం మొగాళ్ళం కదా అయినాసరే. నీపేరేమిటి బుడుగూ అని అడుగుతారు. పోనీలే అని బుడుగు అంటామా. అన్నాక నాతండ్రే అని ఇలా ముద్దుపెటేస్కుని మన బుగ్గలు ఎంగిలిచేస్తారు. యింక మనం వద్దనిచెప్పినా వినరు. ఉత్తిగోల.




ఇంక మనమాటే వినకపోతే మరీ చిన్నపిల్లల మాట ఏం వింటారూ. చిన్నపిల్లలంటే, చాలా చిన్నవాళ్లులే. వాళ్ళకి అస్సలు తెలుగు తెలీదు. వాళ్ళని కూడా ఈ పెద్దాళ్ళు నీపేరేటి, నీ ముక్కేదీ, మీ అమ్మేదీ ఇలా అని గట్టిగా అడుగుతారు గదా.

అపుడు ఆ పిల్లాడు హడ్డలిపోయి ఏడుస్తాడు గదా.

అప్పుడు ఈ పెద్దాళ్ళు ఏడవకమ్మా, మా అమ్మ కదూ, మా నాన్న కదూ అని గట్టిగా అంటారుగదా. వాడు ఉంగా ఉంగా అని అంటాడు.

ఉంగా అంటే కాదు అని అర్థం.

మరి వాడు వాళ్ళకి అమ్మ కాదుగా.

ఉంగా అంటే ఒద్దు అని, లేదు అని కూడా అర్థం ఉంది.

అది పెద్దాళ్ళకి తెలీదు మరి. ఇపుడు, మన్ని ముద్దిస్తావా అంటారనుకో. మనం ఇవ్వద్దు అనుకున్నా ఇస్తాను అని అబద్దం చెప్తాం గదా. అలా అంటే ఓ కాణీ ఇస్తారు వాళ్లు.

మరి ఛాలా చిన్న పిల్లాడిని అడిగితే వాడు ఉంగా అంటాడు. ఉంగా అంటే ఒద్దు అని అర్థం గదా. మరి వాడికి కాణీ అక్కర్లేదుగా. అందుకని నిజం చెప్పేస్తాడు.

అస్సలు వాడు అబద్దం చెప్పాలన్నా చెప్పలేడు.

ఎందుకంటే వాడికి తెలుగు రాదుగా మరి. తెలుగొస్తేనే అబద్ధం చెప్పొచ్చు. తెలుగు రాకపోతే నిజెం కూడా చెప్పలేంగా.

అందికని వాడు ఉంగా ఉంగా అని ఏడుస్తాడు. ఈ పెద్దవాళ్లు వాడి మాట వినరుగా.

వీళ్ళుకూడా అందరూ కలిసి ఇంఖా గట్టిగా ఉంగా ఉంగా అని కేకలేసి వాణ్ణి ముద్దులు పెటేస్కుంటారు ఒక్క కాణీకూడా ఇవ్వకుండా.

అందికని ఈ పెద్దవాళ్ళు చిన్నపిల్లల ఉంగా ఉంగా తెలుగు నేర్చుకోవాలి.

సుబ్బలక్ష్మి వాళ్ళా బాబాయి ఈల తెలుగు నేర్చుకోవాలిట. ఇలా అని బాబాయి అన్నాడు.

నేను దీన్ని గురించి కుంచెం సలహాలు ఇస్తాను.

అయితే నేను ఇపుడు ఎక్కిన ఆడ మెడ్రాసు రైలులో చిన్నపిల్లలు అస్సలు ఉంగా అనుకో. ఒక్క సీ. గాన పెసూనాంబ ఒకటే ఉంది. సీ. గాన పెసూనాంబ అంటే ఆడది.

# సీ గాన పెసూనాంబ

ఆడది అంటే, అసలు అమ్మ అని అర్థం. ఇలా అని నాన్న చెప్పాడు.

ఆడది అంటే పెళ్ళాం అని కూడా అర్థంట. ఇలా అని బాబాయి అభిప్రాయం. బాబాయి దగ్గర ఇవి చాలా ఉన్నాయి అని చెప్పానుగా. వాడిని ఇంకా అడిగితే ఆడది అంటే ఒక్కోసారి సుబ్బలష్మి అని ఒక్కోసారి సీత అని చెప్తాడు అనుకో.

అదన్నమాట. ఇప్పుడు పెళ్ళాం అంటే, దానికి ఫదేళ్ల కన్న చాలా ఎక్కువ ఏళ్ళు ఉంటాయిట. ఇందాకా ఆడ మెడ్రాసు రైల్లో నాదగ్గిర కిటికీలో కూర్చోలేదూ అది అనుకుందూ.



దాని పేరు ససి. అది నాకన్నా చాలా ఎత్తులే. అందికనే ఛాలా గర్వం.

గర్వం అంటే అది మనతో మాట్లాడదన్నమాట. మనం కాఫీ కావాలా ససీ అంటే వద్దులే బుడుగూ అంటుంది.

మళ్ళీ రైలాగాకా, వాళ్ళ ముగుడు వస్తాడుగదా. వచ్చి కాఫీ కావాలా ససీ అంటాడుగదా.

అప్పుడు ససి ఇలా నవ్వుతుంది. నవ్వి వద్దండీ అంటుంది. అయినా వాడు కాఫీ తెచేస్తాడు.

రైలు మళ్ళీ ఆగితే, ముగుడు మళ్ళీ వస్తాడు. మళ్ళీ కాఫీ కావాలా అని అడుగుతాడు.

అప్పుడు ససి మళ్ళీ నవ్వుతుంది.

అది నవ్వితే బాగానే ఉంటుందనుకో. ఎలాగేనా అమ్మంత బాగా ఉండదు.

అపుడు ఆ ముగుడు మళ్ళీ నవ్వుతాడు.

మీరు కూచున్న పెట్టిలో చోటు లేదా అంది మళ్ళీ ససి. అప్పుడు వాడు లేదు ససీ, ఇక్కడే వుండూ, జాగర్త సుమా అని పరిగేరు కెళిపోతాడు.

వాడే కాదు. నేను కూచున్న ఆడమెడ్రాసు రైలుపెట్టి దగ్గిరికి బోల్డుమంది బాబాయిలు వస్తారు గదా. అప్పుడు నేను ఈల వేస్తాను గదూ అందుకూ.

బోల్డు బోల్డు బాబాయిలు వచ్చేసి నవ్వుతూ ఉంటారా.

రైలు కూ అని కూసి ఇలా కదలగానే పరిగేరు కెళ్ళిపోతారు.

మళ్ళీ రైలు ఇలా ఆగగానే పరుగేరుకొచేస్తారు.

వాళ్ళని చూస్తే ససికి బయం. ఇలా ఇటువేపు తిరిగి కూచుంటుంది.

మళ్ళీ వాళ ముగుడు వచ్చాకా, నీతో వచేస్తాను అంటుంది.

వాడు జాగ్రర్త అని చెప్పి వెళ్ళిపోతాడు.

అప్పాడు నాకు జాలివేసింది.




ససిని కొంచెం రక్షించాలి అనుకున్నాను. అందుకని మళ్ళీ ముగుడు రాగానే వురేయ్ వురేయ్ ముగుడూ అలా అస్తమానూ రాకూ, దీన్ని నేను రష్చిస్తానులే అని చెప్పాను.

కాని అది నా మాట వినలేదుగా మరి. నేను కాఫీ కావాలా అంటే ఒద్దు బుడుగూ అంది. నిన్ను రష్చిస్తానులే అంటే ఒద్దులే బుడుగూ అంది.

నేనంటే భయం అన్నమాట. అందుకే రైలుదిగి వెళ్ళిపోయింది.

నాకు బలేకోపం వచ్చిందిలే. నేనేం చిన్నవాడినా లేకపోతే చితకవాడినా. అలా ఖాతరు చెయ్యను అనడం.

ఖాతరు చెయ్యను అనడం అంటే ససి, వాళ్ళ ముగుడితో రైలు దిగివెళ్లిపోవడం అన్నమాట.

నాక్కోపం వచ్చిందిగా. అందుకని కోప్పడేశాను.

అప్పాడు అమ్మ ఎందుకురా బుడుగూ కొపం అంది.

మరి దాని ముగుడితో అది ఎందుకు వెళిపోవాలీ అన్నాను నేను.

దాని ముగుడితో అది వెళ్లకపోతే నువ్వెళ్తావుట్రా పోకిరి వెధవకానా అనేసింది అమ్మ పక్కని కూచున్న బామ్మగారు.

ఘరి నేను రష్చించుతాను అన్నానుగా అలా అన్నాను నేను.

వాడి పెళ్లాన్ని వాడు రష్చించుకోగలడు లేవోయి బోడివెధవా, అంది ముసుగువేసుకున్న ఆ బామ్మగారు.

మరి నాకు పెళ్లాం లేదుగా అని చెప్పాను నేను.

అప్పుడు మరెలాగ.

అందుకని ఎదురుగుండా కూచున్న లావుపాటి పిన్నిగారేమో, మా గానపెసూనాంబని పెళ్ళాడుతావురా అంది.

పెళ్ళాడుతావురా అంటే నాకు తెలీదు. కాని, మరి నేను చిన్నవాడినీ చితకవాడినీ కానుగా అందుకని నాకు అన్నీ తెలుసుగా.







అందుకని సరే మీ గానపెసూనాంబని నేను పెళ్లాడుతావురా లెండి అనిచెప్పేశాను.

అప్పుడేమో ఆ గానపెసూనాంబ నవ్వేసి ఛీ అంది. చిన్నపిల్ల అనుకో. అయినా ఓ ఫదేళ్లు ఉంటాయి.

గానపెసూనాంబా నీ పేరేమిటి అని అడిగాను. నా పేరు సీ. గానపెసూనాంబ అని చెప్పింది.

అప్పుడేమో నీపేరు బుకురుకుగుకు కకాదూకూ అంది.

అలా అంటే ఏమిటో నాకు తెలీదు అనేశా.

అపుడేమో ఓసారి ఉంగా. ఆ.వ్వూ ఉంగా గావ్వూ అనేశా.

అలా అంటే ఏమిటి అంది సీగానపెసూనాంబ.

మరి బుగు రుకు గుకు కకా దూకూ అంటే ఏమిటో చెప్పు అన్నాను నేను.

అప్పుడు అందరూ నవ్వేశారు ఎందుకనో.

తెలీదా అని నవ్వేసింది సీగానపెసూనాంబ. అలా నవ్వితే బలే ఉంటుందిలే.

తెలీదు అని చెప్పాను.

నీ పేరు బుకు రుకు గుకులే అంది మళ్ళీ.

అప్పుడు అమ్మ నా చెవిలో అవును అని చెప్పరా బుడుగూ అంది.

నేను ఓహో అనుకుని; అవును అని చెప్పరా బుడుగూ అనేశాను గట్టిగా.

అప్పుడు అందరూ కలిసి సీగానపెసూనాంబని చూసి హె హె హె అనీ, యే హే హే అనీ నవ్వేశారు. సీగానపెసూనాంబ కూడా నవ్వేసింది.

చిన్నపిల్ల గదూ. ఏం తెలీదుగా అందుకని.

బుకురుకుగుకు అంటే బురుగూ అని అర్థం, ఇది కా భాషలే అని అపుడు చెప్పింది.

అపుడు నేను ఒహో అనుకున్నాను.

మరి ఉంగా ఉంగా ఆ వ్వూ ఉంగా అంటే ఏమిటి బుకురుకుగుకూ అని అడిగింది.

ఉంగా ఉంగా ఆ వూ ఉంగా అంటే మరి, నువ్వు చెప్పింది నాకు తెలియలేదు సీగానపెసూనాంబా అని అర్థమూ, ఇది ఉంగాభాషా, ఇంకా నాకు చాలా భాషలు వచ్చును తెలిసిందా సీగానపెసూనాంబా అని చెప్పాను.




అప్పుడు సీగానపెసూనాంబేమో నాకు నేర్పించవా బుకురుకుగుకూ అంది.

మెడ్రాసు వచ్చేదాకా సీగానపెసూనాంబకి నేను అవన్నీ నేరిపించాను. నాకు తెలుగుభాష కుంచెంవచ్చు. బుడుగుబాష బోల్డు బోల్డువచ్చు. ఇలా అని బాబాయి అన్నాడులే.

ఇంకా నాకేమో ఉంగాభాషా, పిచికబాష, చికబాష, కబాష, బాష, ష అవన్నీ తెలుసును.

పూర్వకాలం, అంటే నా చిన్నప్పుడు నేర్చుకున్నానులే. మొన్నను కూడా ఉంగా బాష కథ ఒకటి నేర్చుకున్నాను. కత కర కవా కత కచె కప్తా కను కలే.

## అసలు పాపాయిలు ఎందుకు?

అమ్మ ముద్దు పెట్టుకుందుకు.

అందుకనేగదా పాపాయిలు మనకి ముద్దొస్తారు.

మరి అలాంటప్పుడు అమ్మ వెళ్ళి వాళ్ళని ఎత్తుకొని ముద్దుపెట్టుకోవాలి గదా. లేకపోతే పాపాయికి కోపం రాదు మరీ.

పాపం. ఆ పాపాయిలు అలా కోపం వస్తే ఎలా చెపాటు. వాళ్లకి తెలుగు రాదు గదా మరి.

అందుకని వాళ్ళు ఉంగా ఉంగా భాషలో గాలిగా చాలా సేపు చెప్తారు.

మరి పెద్దవాళ్ళకి తెలుగు ఒకటే ఒచ్చుగదూ. ఉంగా ఉంగా అంటే తెలీదుగా. అందుకనేమో వాళ్ళు యాడవకు పాపాయీ అంటారు.

అప్పుడు పాపాయికి ఇంకా చాలా కోపం వచ్చేస్తుంది. నాకు కోపం వస్తే అమ్మేమో యాడవద్దూ అంటుందేమిటే అని ఇంకా గట్టిగా ఉంగా ఉంగా అంటుంది.

అంటే, నేను అస్సలు యాడవడం లేదూ, కోపం పడుతున్నానూ అని అర్థం.

మరి ఇంకెలాగా? పాపాయికి కోపం అని అమ్మకి తెలీదు. అమ్మకి తెలీదని పాపాయికి తెలీదు.

మరి పాపాయి పాపం చిన్నదిగదా అందుకని అమ్మదే తప్పు. మా అమ్మ మంచిదే అనుకో.

అయినా, చిన్నపిల్లలు ఎప్పుడూ తప్పు చెయ్యరుట. చిన్న పిల్లలు దేవుళ్ళుట. నాన్న కొరెస్తానంటాడేం. అప్పుడేమో బామ్మ ఇలా అంటుందిలే అదీ సంగతి.

పెద్దవాళ్ళే తప్పుచేసేసి ఉత్తినే అలా అంటారు. అని బామ్మ చెప్పింది.

యేం, పాపాయి కోపం అప్పుడెలా పోతుందంటే మరి, అమ్మేమో యాడవకు పాపాయీ అని ఎత్తుకుని ముద్దుపెట్టుకొంటుందిగా అప్పుడూ.

యెప్పుడూ అలాగే పోతుంది పాపాయి కోపం. ఎవళ్ళేనా ముందస్తుగా వచ్చి ఎత్తుకున్నా సరె. అమ్మవస్తే అమ్మ దగ్గరకే వెళ్ళిపోతారు గదా.

ఏ పాపాయికేనా సరే వాళ్ళ రాధ అంటేనే ఎక్కువ ఇష్టం. రాదంటే అమ్మ. నాన్న కన్నా, బామ్మకన్నా, పిచికకన్నా, బొమ్మకన్నా సీ.గానపెసూనాంబ కన్నా రాధంటేనే ఎక్కువ ఇష్టం అన్నమాట.

అసలు అలాగే ఉండాలిగదా మరి, ఇప్పుడు యిలాంటి కథ ఓటి చెప్తాను ఆ కథ అర్థం ఇదే.

ఒక్క పిచికకన్నా, రెండుపిచికలకన్నా, ఇంకా చెప్తే చింతచెట్టుమీద పిచిక గూడుకన్నా, చెరువుగట్టుకన్నా, ఫ్రదిపిచికలకన్నా పాపాయికి వాళ్ళ రాదంటేనే చాలా ఇష్టమూ అని.

నేను రేపో నిన్నో బాబాయికి ఇలా చెప్తే, ముందస్తుగానేమో ఖధచెప్పాలీ, తరువాతేమో నీతి చెప్పాలీ అన్నాడు, నీతి అంటే ఏమిటో నాకు తెలీదు.

నీతి అంటే కోత అని బాబాయే చెప్పాడు.

బాబాయి ఎప్పుడూ ఫ్రది సార్లేనా కోతలు కోస్తాడుట. కోత అంటే నాకు తెలీదు.

కోతసంగతి పోతేపోనీ కానీ, కథ ఏమిటంటే, ఓ పాపాయి, వాళ్ళ అన్నయ్య, వాళ్ళ రాధ వాళ్ళందరూ ఇంచక్కా వాళ్ళ పెరట్లో పడుకుని నిదరోయారు, అంతట్లోకి పొద్దుల్న వచ్చేసిన్ది.

అయినా యింకా ఇంత చిన్న చల్దమామ ఆకాసెం మీద ఉన్నాడు. వాడు చూట్టానికి అచ్చు జీడిపప్పులా ఉన్నాడన్నమాట. ఆ చల్దమామ.

పాపాయేమో కళ్ళు మెల్లిగా తెరచి వాణ్ణి చూశాడు. ఇంకా రాత్తిరి ఆయిపోలేదు అనుకుని మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

అప్పుడేమో వాళ్ళరాధ లేచింది. లేచి పాపాయిని చూసింది.

హాఁ హాఁ ఈ పాపాయి ఇంకా నిద్దరోతున్నాడు గదా అనుకుంది. అనుకుని – (పేజి యిలా తిప్పు)

# పాపాయి కోపం కథ - నే చెప్తే రాసిపెట్టినవాడు నండూరి రామమోహనరావు

పెరట్లో - అసలు నిజంగా ఆ పాప నిద్దర
పోటంలేదు! ఉత్తినే కళ్ళు మూసుకుంది
మరి వాళ్ళమ్మకి తెలీదు కదా!
పడుకుంది కదా అని ఇంట్లోకెళ్ళింది



అమ్మ వెళ్ళగానే దొంగపాప కళ్ళు తెరిచి
నవ్వేసింది - మరి వాళ్ళ రాధ చూళ్ళేగా!
(రాధంటే అమ్మలే)



మరి పాపాయి నవ్వితే అమ్మ అందరూ
ముద్దెట్టుకోవాలిగా! మరి పాపని ఎవరూ
చూళ్ళే - అందుకు వాడిక్కోపం వచ్చింది



రాము మరి! ఇంతలోకి వాళ్ళన్న వచ్చి
ఇలా గిల్లి వెళ్ళిపోయాడు
ముద్దుకూడా అడగలేదు మరి!



మరి కోపం వస్తే చెప్పాలిగా! అందుకు
వాడు కేరు కేరు మని యాయా
అని ఘట్టిగా చాలా సేపు చెప్తాడు



ఏం - అప్పుడేమో ఓ బంగారు
పిచిక పాపని చూసింది







తెలుగులో:- ఏడుపు కాదు - కోపం!
అమ్మ నాన్న నన్ను ముద్దెట్టుకోటంతో
నేను లేచినా - అందుకనే —




"ఈ మనుషులంతే ఇంతే —
నిజెం - మరేం - నువ్వు నాతో
మాయింటికి వచ్చెయ్ - ఏం?"

②




అంటే: "మీ యిల్లెక్కడం మరి?"







మా యిల్లు బలే వుంటుందిలే! అడుగు నించి లోపల కిలామారి పోవాలి. అక్కడించక్కా వెచ్చగా పడుకోవచ్చు. చెరువు గట్టుమీదాడుకోవచ్చు















# పిల్లల్ని పెంచెయ్యడం



ఇప్పుడు ఏడుపు అంటే ఏమిటో, కోపం అంటే ఏమిటో చెప్పాను గదా అని బాబాయివాళ్ళు నా దగ్గిర అలుసు తీసుకున్నారు. తీసుకుని నన్ను నెత్తిమీద, నడ్డిమీద, ఛం పేసి ఎలాగో యేడిపించాలని చూస్తున్నారు.

అప్పుడేమో, ఏంరా బుడుగూ ఇది యేడుపా లేకపోతే మరి, ఖోపమా అని అడుగుతారట. ఇది బాబాయి అయిడియాట.

అయిడియా అంటే ఆశ అని అర్థం. ఇలా అని నాన్న చెప్పాడు. ఇవి కూడా బాబాయిదగ్గిరే ఛాలా ఉన్నాయట.

యేం మరి నన్ను యేడిపించాలని బాబాయి చూస్తాడుగా. అయినా నేను ఎప్పుడూ ఏడవనులే. నేనేం చిన్నవాడినా లేకపోతే చితకవాడినా, అందుకూ.

కాని ఎలాగేనా ఈ పెద్దవాళ్ళు – అంటే నేను కాదులే. ఛాలా బోల్డు పెద్దాళ్ళు. ఈ పెద్దాళ్లు చిన్నపిల్లల సంగతి కుంచెం తెలుసుకోవాలి.

అప్పుడే, వాళ్ళు పిల్లలిని బాగా పెంచగలరు.



పెంచడం అంటే, మనకి నిద్దర్రానపుడు పడుకో అని కోప్పడేసెయ్యడం.

ఇంకా, ఆకలేసినా ఓసారో ఆరుసార్లో అన్నం పెట్టను అనడం. మళ్ళీ యేమన్నా కూడా పెట్టను అనడం, అదన్నమాట

ఇంకోటి ఉంది, నాకు నీళ్ళోసుకుల్తే జలుబు జేస్తుంది కదా. అస లిప్పుడే బోల్డు బోల్డు చేసిల్ది. బాటలు బాఘా రాలంట్లుల్లయి. లిజమేగదూ.

యేం మరి జలుబు చేసినపుడు నీళ్లోసుకోకూడదు గదా. అయినా మన్ని రోజూ నీళ్లోసుకోమంటారు అసయ్యంగా.

అలాగే పెద్దవాళ్ళకి ఉంకో చెడ్డ అలవాటుంది. మన్ని ఎప్పుడూ చెడ్డీ చొక్కా తొడుక్కోవాలంటారు.

అలవాటంటే, మన్ని ఉత్తినే తిట్టడం, నడ్డిమీద ఛంపెయ్యడం అని అర్థం.

యేం పెంచడం అంటే ఇదీ అర్థం.

మన సంగతి సరే. మన్ని వీళ్లెలాగా పెంచలేరనుకో. అసలు దొరకనుగా పెంచడానికి.

ఇంకా పాపం చిన్నపిల్లలుంటారు చూడూ. అంటే ఛాలా చిన్నవాళ్ళు. వాళ్ళని ఈ పెద్దవాళ్ళు ఇష్టం వచ్చినట్టు పెంచేస్తారు.

అయితే ఓటుందిలే.

ఈ ఛ్చిన్న పిల్లలు లేరూ వీళ్ళు అసలు మంచివాళ్ళు కారు. పైగా తెలుగు రాదు.

అన్నింటికీ యేడుస్తారు అందుకని.

కొందరు నిజెంగా ఏప్పుడూ యేడుస్తూనే ఉంటారనుకో. ఆకలివేసినా యేడుస్తారు. పాలుతాగినా యేడుస్తారు, తాగేశాక మళ్ళీ యేడుస్తారు.

యిలాంటి వాళ్ళంటే నాకు బోల్డు ఖోపం.

# మూడు ఐడియాలు



కాని ఏడిచేవాళ్ళని ఏడచకుండా చెయ్యడం నాకు వచ్చును.

యిప్పుడు ఓ చిన్న పాపాయి ఏడుస్తోంది గదా. ఊరుకోవే నాతల్లీ అని వాళ్ళ అమ్మో, ఊరుకోరా నాతండిరీ అని వాళ్ళ నాన్నా చెప్తారుగదా. అది ఊరుకోదుగా.

అప్పుడు నేనే కనక అమ్మా నాన్నా అయితే, ఆ పాపాయికి ఇటువేపునీ అటువేపునీ కూచుని గాఠిగా ఏడిచేస్తాను, దెబ్బకి హడ్డిలిపోవాలది. హడ్డిలిపోయి నోర్మూసుకుంటుంది అంతే.

అప్పుడుకూడా యేడుస్తుందనుకో. అంటే మనం ఆపేశాక. మరి మనం ఛాలా సేపు అరవలేంగా. చిన్న పిల్లలికైతే బాహో అలవాటు కాబట్టి వాళ్ళు చాలాసేపు గుక్కపట్టుతారు.

యేం. అప్పుడింకా లాభంలేదుగా. నాన్న జేబురుమాలు పెట్టి పాపాయి మూతి కట్టెయ్యాలి. ఇది బాబాయి అయిడియా.




అసలు నా అయిడియా ఏమిటంటే, మరి అది యలాగా ఏడుస్తోందిగా, అందికని ఊచి పుచ్చుకుని ఒకటి కొట్టేసి పరిగేరుకెళ్ళిపోవాలి వాళ్ళ అమ్మా నాన్నాను.

కాని అమ్మా నాన్నా అలా ఏ పాపాయిని కొట్టరుగా. ఎందుకు అంటే, వాళ్ళు అమ్మా నాన్నా గదా. అందుకని మనం కొట్టాలి మరి.

ఇంకో రకం పాపాయిలు ఉన్నాయి. అవి పాపం యేడవ్వు. అస\లు ఏడవ్వు.




మనం దగ్గిరకెళ్ళి ఎవరూ చూడకుండా గుండు మీద ఓటుచ్చున్నామనుకో.

అప్పుడేమో అవీ, యేడిశావులే అని ఇంచక్కా నవ్వేసి మళ్ళీ ఆడుకుంటాయి.

నేను బలే హాశ్చర్యపడిపోయేస్తుంటాను. అసలీ పాపాయిలు ఏ మాటలాడుకుంటాయి అనీ. వాటికి జాంచెట్టు ఎక్కడం రాదు గదా. సీతజెడ కత్తిరించ లేదు గదా. మళ్ళీ లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడి గుండుమీద సూటిగా రాయి కొట్టలేవు గదా. (ఒంకరగా కూడా కొట్టలేవనుకో) ఆఖరికి ఉత్తుత్తి జెటకా కూడా తోలలేవు.

మరి ఎలా ఆడుకుంటాయో గాని.

అసలు ఆడుకోవేమోలే.

ముందస్తుగా ఏడుస్తాయి. మళ్ళీ పాలు తాగుతాయా. మళ్ళీ బావుండదని కుంచెం సేపు ఊరుకుంటాయా.

మళ్ళీ ఏడుస్తాయి. అమ్మవచ్చి ఇలా జో కొట్టుతుంది కదా.

పడుకుంది పాపాయి గదా అని, లేచి వెళ్ళుతూ ఉంటే, ఘుబుక్కుని మళ్ళీ ఖయ్యో మంటాయి. అమ్మ హడ్డిలిపోయి పరిగేరు కొచ్చేస్తుంది. అప్పుడు నవ్వుతాయి పాపాయిలు. మళ్ళీ ఏడుస్తాయి. ఇంతేగా ఆట. నా మొహంలా లేదు.

గాఢగా పాటపాడుతూ బ్రిడ్జి మీద పరిగెట్టుతారు



ఎందుకంటే, నా మొహం బావుందని అమ్మ చెప్పింది. అందుకూ.

నా ముహం సినిమాలో పాపాయిలా ఉంది అని బామ్మ కూడా అంది. బామ్మా నేనూ రేపో మొన్నో మూడ్రోలుకో సినిమా చూశాంలే. అందులో ఓ కుర్రాడున్నాడు.



వాడు కూడా నా మొహంలా లేడనుకో. ఐనా, బావున్నాడని బామ్మ అంది.

ఐతే చిన్న పిల్లలసంగతి మనకెందుకులే. మన కెందుకులే అంటే మనకి ఒద్దూ అని అర్థం.

ఇప్పుడు అమ్మ చూడు చదువు మన కెందుకులే అంటుంది గదా నన్ను. అంటే చదువు ఒద్దులే అని అర్థం. అదీ సంగతి.

# ఆడపిల్లలు

యేం ఆడపిల్లల గురించి కుంచెం చెప్పాలి. ఆడ పిల్లలంటే బాబాయీ వాళ్ళు లౌ లెట్రు ఇస్తానంటారు వాళ్ళు.

సీ. గానపెసూనాంబ కూడ ఆడపిల్లే గాని, అది బాఘా చిన్నపిల్లనుకో. దానికి తెలుగు కూడా బాగా రాదు.

నన్ను బుడుగూ అని కూడా అనలేదు. బురుగూ అనీ బులుగూ అనీ అంతుంది. దానికి అసలు మాతలాడ్డమే చాతకాదు. మరీ చిన్నపిల్ల. అయినా లెందుజెదలు వేసుకుంతుందనుకో.

మనం బోల్డు పెద్దవాళ్ళం కాబట్టి పెద్దవాళ్ళను గురించే మాటాడాలి. ఇలాని బాబాయి చెప్పాడు లౌలెట్రు పెద్దవాళ్ళకే యియ్యాలి అన్నమాట.

అంటే యిప్పుడు బాలరాజు సినిమా జయసింమ్మ సినిమా ఉన్నాయి గదా. నాగేసరావు, ఎం. టి. రామారావు ఇలా నించుంటారారా చెట్టు దగ్గర. అప్పుడు అంజలీయేనా సావిత్తిరియేనా వస్తుంది గదా.

మరి అది యీరోవేపు యిలా కళ్ళు అస్సలు మూసుకోకుండా చూస్తుంది గదా. అప్పుడు పాట పాడుతుందా. అప్పుడేమో యీరో కూడా యిలా నవ్వి ఆగు అని చెయ్యి ఎత్తుతాడా.

మరి అది పాటమానదుగా. కాని పరిగేరు కెళ్ళిపోతుంది. అప్పుడేమో యీరో ఆగు పారిపోకు అని గారిగా పాట పాడుతూ పరిగెట్టుతాడు.

మీ నాన్నతో చెపుతుందని బయంగా వాడికి అందుకు.

అప్పుడేమో అది మళ్ళీ బిర్జీమీద ఆగి యిలా కళ్ళు మూసుకోకుండా చూసి నవ్వుతుందా. నువ్వూ నేనూ ఇంకా బోల్డు రౌడీలు ఈల వేస్తాం కూడా.

అప్పుడు యిద్దరూ పాడతారుగదా.

ఆ పాటపేరు లౌ సాంగు అని బాబాయి చెప్పాడు......వాడికి లౌ సాంగులు చాలా వచ్చును. ఇంట్లో పాడితే బామ్మ కోప్పడేస్తుందనుకో. అందుకని బీచిలో పాడుతాడులే.

బాబాయికి సినిమాలూ, లౌ సాంగులూ, సిగరెట్టులూ, ఆడపిల్లలూ, బామ్మ వత్తుల పెట్టిలో డబ్బులూ, బడికి సెలవులూ అంటే చ్చాలా యిష్టం.

అందికనే బాబాయీ నేను రోఝూ సాయింతరం బీచీ దగ్గిరికి వెళ్తాం.

అక్కడేగా ఆడ బడి వుంది మరి.

అసలు బడి అంటే గుడి అని అర్థం. ఇలా అని నాన్న చెప్పాడు, నాన్నకి బాగా తెలీదనుకో.

అసలు బడి అంటే అర్థం లేదూ అని బాబాయి చెప్పాడు.

కాని గుడి అంటే ఆడబడీ అని అర్థం ఉందిట. అదీ సంగతి.

అందికనే నేనూ బాబాయీ ఇంకా బోల్డు బోల్డు బాబాయిలూ బొమ్మలుచొక్కాలు తొడుక్కుని, ఫవుడర్లు అద్దుకుని, సిగరొత్తులు కాలుస్తూ, ఈ గుడి దగ్గిరికి వస్తారు గదా.

గుడి లోపలికి వెళ్ళరనుకో.

అప్పుడు గుడిలోంచి రెండు జడలు వేసుకున్న సీత ఒస్తూందిగా. ఇంకా బోల్డు జెడలు వేసుకున్న సీతలు వస్తాయనుకో.

అప్పుడు భాబాయి నవ్వుతాడు.

ఒక్కో సీత ఇలా హూం అనీ ఖోప్పడేస్తుంది. ఇలాటి సీతని చూస్తే బాబాయికి బయం.

బయం అంటే కోపం అని అర్థంగా మరి.

అందుకని బాబాయి వురేయ్ వురేయ్ బుడుగూ మరేమోనూ, నువ్వూ ఆ సీతని ఏడిపించరా అంటాడు.

నేను సీతని ఏడిపిస్తే దానికి ఖోపం వస్తుంది. అప్పుడు మనికి కుంచెం డేంజెరనుకో. మనని ఎవరూ రష్చించరు కూడా.

రేపో మ్నూడ్రోలుకో ఏం జరిగింది తెలుసా

# ఇందిర అనే రెండు జడల సీత ఖధ

ఒక బాబాయీ, ఇంకో ఆరు బాబాయిలూ, నేనూ కలిసి ఆ ఆడబడికి వెళ్ళామూ.

అప్పుడు ఇందిర వచ్చిందికదా. రెండుజడలు వేసుకుందామరి. ఇందిర అంటే కాలేజీ అమ్మాయి అని అర్థం.

ఈ ఇందిరేమో వాళ్ళకి తెలీదు. మరి యెలా మాటాడ్డం?

ఒక బాబాయేమో నన్ను పిల్చి వురేయ్ సత్తరకాయీ సత్తరకాయీ మరేమో నువ్వూ ఈల వేసి ఇందిరిని పిలవరా అన్నాడు.

నన్ను కొట్టుతుంది బాబూ అని చెప్పాను.

అయినా ఫరవాలేదులే అన్నాడు వాడు.

ఫరవాలేదులే అంటే. కొట్టితే కొట్టనీ అని అర్థం. మరి ఇందిర నను కొట్టిందిగా అందుకని.

నేను మెల్లిగా ఈలవేశాను.

అలా కాదు గాఠిగా వెయ్యాలీ. వేసి రెండు జెడల పిల్లా అని పిలవాలీ అన్నాడు వారు.

సరేగదా పాపం అని నేనూ అలా పిలిచానుగదా.

అప్పుడేమో ఆ యిందిర ఘబుక్కుని ఇటువేపు తిరిగి ఫోకిరీవాడులారా అనేసింది.

కాని అప్పుడు చూస్తే ఒక బాబాయీ లేడు, ప్ఫది బాబాయిలుకూడా అక్కడ లేరు. వాళ్ళు అందరూ గట్టుమీద కూచున్నారు.




నేను ఒక్కడే అక్కడ ఉన్నాడు.

నేను హాచ్చర్యపడిపోయేశాను.

ఇందిర కూడా హాచ్చర్యపడేసింది.

హారి నువ్వా పిడుగూ అంది.

నా పేరు బుడుగు. నువ్వే హారి పిడుగు అని చెప్పాను.

ఫోకిరీ పిల్లాడా అంది.

నువ్వే ఫోకిరిపిల్లాడా అని చెప్పేశాను నేను.

మరీ నన్ను రెండు జెడలు అని ఎందుకూ పిలిచావూ అంది.

నీకు రెండు జెడలు ఉన్నాయిగా అందుకని అని మళ్ళీ చెప్పేశాను.

ఉంటే నీకేం అంది.

ఉంటే నీకేం అంటే నాకు తెలీదు అని చెప్పేను.

తెలీకపోతే, ఇదిగో ఇదీ అనేసి, ఆ యిందిర నాగుండుమీద మొట్టికాయ కోటేసింది.

ఆయినా కోపం పోలేదు. అందుకని యిలా కిందకూచుని ముద్దు పెట్టేసుకుంది. అప్పుడు సీగానపెసూనాంబ చూడలేదనుకో.

చూత్తే వెక్కిరిత్తుంది.

మా బామ్మా, అమ్మా అంతే. ఒక్కోసారి సీగానపెసూనాంబ చూస్తున్నప్పుడే నను బంగారు తండిరీ అంటారు. అంటే ఫరవాలేదనుకో కాని ముద్దు కూడా పెట్టేసుకుంటారు.

అప్పుడు సీగానపెసూనాంబ డిల్లమ్మా డిల్ల అని వెక్కిరిస్తుంది. అప్పుడు అమ్మ ఘబుక్కున దాన్ని కూడా పట్టుకుని ముద్దు పెట్టేసుకుంటుంది.

అయిందా పెళ్ళి అని ఏడిపిస్తాననుకో అప్పుడు నేను.

యేం బీచీలో ఈ రెండు జెడల పిల్ల అప్పుడేం చేసింది తెలుసా?

ఫోకిరీ పిల్లాడా పద మీయింటికి పద మీ అమ్మతోచెప్తా నీ పనీ అంది. అని నా చెయ్యి పట్టుకుంది.

మరి అప్పుడుకూడా బాబాయి వచ్చి నన్ను రక్షించలేదు.

ఎలాగ?

మరి నేను చిన్నపిల్లాడినిగదా.

అందుకని సరేను యింటికిరా అమ్మతోటి చెప్ప అన్నాను.

అప్పుడు బాబాయి ఘబుక్కున వచ్చేసి ఏవండీ ఏవండీ మీరు మా యింటికి రావద్దండీ అన్నాడు.

ఈ ఫోకిరీ పిల్లాడిని వాళ్ళమ్మచేత తన్నించాలి నేను వెళ్తాను మీ యింటికి అంది ఆ యిందిర.

అది కాదండీ. మరేమోనండీ, నేనే వీడిని తంతానులెండీ, వదిలేయండీ అన్నాడు బాబాయి.

నాకు జాలేసింది.

ఇందిరికికూడా జాలేసింది. అప్పుడేమో ఫోకిరిపిల్లాడా అని బాబాయి వేపుచూసి, నా నెత్తిమీద జెల్లకాయకొట్టి పో అంది.

అప్పుడు నేనూ బాబాయీ మెడ్రాసు రైల్లా ఘబఘబా వెళ్ళిపోయాం.

## ఈ పెద్దవాళ్లు

పాపం యీ పెద్దవాళ్లెపుడూ యింతే.

ముందస్తుగా వాళ్లమాట వినాలి అంటారు గదా. పోనీలే అని మనం అల్లరి చేస్తే అప్పుడు మన్ని రక్షించరు.

మళ్ళీ అల్లరి చెయ్యను. అంటే చెయ్యి అంటారు. చేస్తానూ అంటే ఒద్దూ అంటారు.

ఎప్పుడూ మనమే వాళ్లమాట వినాలి అంటారు. ఒక్కసారేనా వాళ్ళు మనమాట వినరు.

అంతెందుకు. యిప్పుడు పాపం బాఘా చిన్న పిల్లలుంటారా.

వాళ్లకి కుంచెం తెలుగువస్తుంది చూడు. అప్పుడేమో, ఎవరూ లేకుండా కొంచెం మాటాడుతారు.



పాపాయికి కోపం వచ్చేస్తుంది

ఈ అమ్మా నాన్న బామ్మ యిలాటివాళ్లు ఎలాగో వినేస్తారు.

అప్పుడు లావుపాటి పక్కింటి పిన్నిగారూ, వాళ్ళ మొగుడూ అలాటి వాళ్లు మనింటికొస్తారా అప్పుడేమో ఈ పాపాయిని కూచోబెట్టి నీ పేరు చెప్పూ అంటారు.

పాపం ఆ పాపాయికి బాఘా తెలుగు రాదు గదా. దానికి భయం వేసి చెప్పదు.

అప్పుడేమో ఈ లావుపాటి పెద్దవాళ్ళందరూ చుట్టూ నించుని చెప్పుచెప్పు చెప్పూ అని కేకలు వేస్తారు గదా.

పాపాయికి కోపం వచేస్తుంది.

దాన్ని రక్షించడానికి, నేను చెప్తాననుకో పేరు. వాళ్ళు వినరుగా. నన్ను కొరేస్తారు. దాని పేరు అదే చెప్పాల్ట.

అది చెప్పదుగా మరి.

అప్పుడు వాళ్ళమ్మా నాన్నా దాన్ని కొరేస్తారు మొండిఫిల్లా అని.

వాళ్లకి మొండిపిల్ల అంటే అసలు అర్థం తెలీదు. నాకు తెలుసుననుకో.

లావుపాటి పక్కింటి పిన్నిగారు ఒకసారి పేరంటానికెళ్ళి వాళ్ళ పాపని ఎత్తుకుంటుందికదా.

అప్పుడు పాప చంక దిగనంటుందికదా. వాళ్ళమ్మ పిలిచినా వాళ్ళనాన్న, బామ్మ పిలిచినా రాను పో అంటుంది.

ఆఖరికి ఇంకో పాపాయి వచ్చి ఉంగా బాషలో ఆలుకుందాం వత్తావే అని పిలిచినా సరే లాను పో అంతుందే. అదీ మొండిపిల్ల.

ఏమిటో ఈ పెరపంచకంలో బోల్డుబోల్డు రకాల పిల్లలు.

బోల్డురఖాల పెద్దవాళ్ళు. నేను అప్పుడప్పుడు హాచర్యపడి పోయేస్తుంటాను.



## అయిడియాలూ- అభిప్రాయాలూ

ఇగో మరేం. నాదగ్గిరకూడా అయిడియాలూ అభిప్రాయాలూ ఉన్నాయి తెలుసా......ఒక్క బాబాయి దగ్గిరే ఉన్నాయి అనుకున్నాగాని

షుడియోలో మనయిల్లుకన్నా పెద్ద అబద్దాలుంటాయట





ఇప్పుడే సినిమా షుడియోకి వెళ్ళాక, నాకు ఈ సంగతి ఘుబుక్కుని తెలిసిపోయింది.

సినిమా షుడియో నిండా బొమ్మలూ, గుర్రాలూ, అయిడియాలు, కిరీటాలు, నాగేసరావూ, రామారావూ, సావిత్తిరీ, అంజలీ, రేలంగీ, అయిడియాలు, సిగరెట్టులూ, రూపాయిలూ, ఇంకా మరేమో, అయిడియాలూ, పెద్ద వెలిక్ట్రీదీపాలు, కాఫీలు, అయిడియాలు అవన్నీ ఉంటాయట. ఇలాని బాబాయి చెప్పాడు.

మనం షుడియోకి వెళితే మనకీ బోల్డు బోల్డు అయిడాలు వచ్చేస్తాయి. హాచ్చరపడి పోయేస్తామన్నమాట. అయిడియాలు అంటే నాకు తెలీదు. కాని నా దగ్గర బోల్డున్నాయిలే.

ఇంఖా మరేమో, మనయిల్లు కన్నా పేద్ద అద్దాలు అబద్దాలు ఉన్నాయని కూడా బాబాయి చెప్పాడు.

షుడియోలో సినిమాలు వేస్తారన్న మాట.

ఇపుడు లష్మీష్టాకీసు ఉందా. అంజలి, రామారావు, రేలంగి వాళ్లందరూ అక్కడ సినిమా వేస్తారు గద.

షుడియోలో ముందస్తుగా ఈ సినిమా వెయ్యాలిట. అక్కడా ప్రతి లష్మీష్టాకీసులు ఉంటాయి.

లష్మీష్టాకీసులో ఓ సారే సినిమా వేస్తారుగాని షుడియోలో ప్రతిసార్లో ఇరవై పదకొండు సార్లో వేస్తారులే.

ఇప్పుడు యీరో యిలా కళ్ళు మూసుకోకుండా తోటలో సీతకేసి చూడాలి కదా, చూసి పాడాలి గదా.

పాడి నవ్వాలికదా. అప్పుడు సీత మళ్లీ నవ్వుతుందా మరీ.

ఓ సారి నవ్వాక దీపాలన్నీ ఆరిపేస్తారు.

మళ్లీ కాసేపుండి దీపాలు వెలిగిస్తారా. అప్పుడు మళ్లీ నవ్వు అంటారు.

ఇలా ప్రతిసార్లు నవ్వితే యేడుపు వస్తుందిగా.

అంతట్లోకి సీత నాన్న వచ్చేసి హేయ్ రౌడీ రాస్కెల్ అని కోప్పడేస్తాడుగా అప్పుడేమో సీత ఝూంమని ఏడిచేస్తుంది.

యేం. మరి పాపం చిన్నిపిల్లకైతే ఘబుకుని ఏడుపురాదు. ప్రతి రూపాయి లిస్తానంటే కూడా వాళ్లు యాడవరు.

# సీరాముడికి ఒక్క కొడుకు చాలురే

రేపో మూడ్రోలుకో ఓ షుడియోలో ఓ పిల్లాడిని యేడూ యేడూ అని భలేగా యేడిపించేశారు పాపం.

అది అసలు మొగాడుకాదు ఆడది అనుకో. సినిమాలో ఉత్తినే అబద్ధం చెప్పమన్నారు పెద్దవాళ్లు.

యేం సినిమా అమ్మ వాడి దగ్గర కూచుని యాడవకు బాబూ అంటోంది గదా. మరి వాడు అస్సలు యాడవటం లేదుగా.

ఇహిహీ అని నవ్వుతున్నాడు గదా.

అప్పుడు ఓ లావుపాటి వాడొచ్చి ఏడవాలి పాపా ఇంచక్కా ఏడూ అమ్మా అన్నాడు. వాడి పేరు డైరెక్కర్‌ట.

ఎవరేనా ఇంచక్కా ఏడుస్తారా. అసలు ఏడిస్తే మనకి చూట్టానికి ఏడిసినట్టుంటుంది.

ఆ పిల్లాడేమో నవ్వుతున్నాడు. వీడూ, సినిమామ్మా యిలా మూతి ముడుచుకుని ఏడూ పాపా ఏడూ పాపా, నీకు రూపాయిస్తా అని చెప్పుతున్నారు.

అంతట్లోకీ నాకు అయిడియా వచ్చేసింది.

అంతట్లోకీ ఇంకో పెద్దవాడు ఘబగబా వచ్చేశాడు.

వచ్చేసి యింకా ఏడవలేదా అన్నాడు కోపంగా.

లేదండీ అని చెప్పారు డైరెక్కరూ, సినిమామ్మా ఇలా ముహంపెట్టి. ఝెడు! హూ! అనేసి కోప్పడేశాడు ఆ కొత్తవాడు.




ఏడిశావు ఫో నేను యాడవను అనేశాడు ఆ పిల్లాడు.

అప్పుడు వాడికి కోపం వచ్చేసింది, ఏడూ! పాపా, మంచిదానివీ అని చెప్పాడు నవ్వుతూ.

పెద్దవాళ్ళకి కోపం వస్తే నవ్వుతారులే.

అయినా పాప యేడవలేదు.

ఇం కెలాగ టైమైపోతోంది అని కోప్పడ్డాడు కొత్తవాడు.

టైమైపోతే బోల్డుబోల్డు రూపాయలూ కాణీలూ కూడా అయిపోతాయట. ఇప్పుడు ఆ కొత్తవాడే అస్సలు సినిమావాడుట. ఇలాని నాన్న చెప్పాడు.

వాడికి ఇంకా ఛాలాకోపం వచ్చేసింది.

హూ అనేసి, ఇలా జుట్టు పీక్కున్నాడు కాని వాడికి జుట్టు లేదుగా. ఉత్తిగుండు. అందుకని, ఇంకా కోపంవచ్చి ఈ పాప అస్సలు వద్దు అనేశాడు అప్పుడు.

మరి ఇంకోళ్ళను పిలవనా అన్నాడు డైరెక్టురు.

ఎందుకు అసలు వద్దు అనేశాడు కొత్తవాడు కోపంగా.

మరెలాగండీ. సీరాముడికి రెండు కొడుకులుగదా అంది సినిమా అమ్మ.

యేం కాదులే ఒక్క కొడుకు చాలూ, వీడు అసలు ఒద్దు ఫో అనేసి వాడు ఘబగబ వెళ్లిపోయాడు.

అప్పుడు నాన్న లేచి సినిమా అయిపోయింది ఇంటికెళ్లిపోదాం అన్నాడు.

బామ్మ కూడా సరే అంది కాని, బాబాయేమో ఇంకో సినిమా చూద్దాం అని ఏడిచాడు.

సరే పదనాన్నా అని చెప్పాను నేను. అక్కడ ఓ చెట్టుకింద ఒక సీత పాపం నిఝంగా ఏడుస్తోంది. వాడెవడో రౌడీ యిలా నిలబడి హు అని ప్రెవేటు చెప్పేస్తున్నాడు దానికి. వాడు బీడీకూడా కాల్చుతున్నాడు.

నాకే బయం వేసిందిలే. కాని పాపం ఆ సీత నన్ను వదులు నన్ను వదులూ అని ఏడుస్తోంది. వాడు వదల్నా వదల్నా హూ హూ అంటున్నాడు.

అందరూ యిలా బయపడి చూస్తున్నారు.

ఆ సీతని రష్పించా లనుకున్నాను కాని కుంచెం బయం వేసిందిలే.

బామ్మకి కూడా ఆ సీతమీద జాలేసింది.




వురేయ్ గోపాళం, నువ్వేనా చెప్పరా ఆపిల్లని వాడు అల్లరి పెడుతున్నాడూ, వాళ్ళలా చూస్తారేవిటీ అనేసింది.

నేను కూడా యింక రష్పించెయ్యా లనుకున్నాను.

ఏయ్ సీతా, మా నానతో చెప్తానను, మా నానతో చెప్తాననూ అని చెప్పేశాను.

క్కాట్ అనేసి అక్కడున్న మొగాళ్ళందరూ ఘారిగా అరిచేశారు. హడ్డిలి పోయానులే.

అంతట్లోకే, ఆ సీతా రౌడీ అందరూ నవ్వేశారు.

ఉత్తుత్తి ఏడుపేనా అని నేను హాచ్చర్యపడి పోయేసి లేచాను.

అప్పుడు ఆ రౌడీ నా దగ్గిర కొచేసి ఎవఢ్రా నువ్వు ఫోకిరీ అన్నాడు.

నువ్వేవఢ్రా ఫోకిరీ కొ్ఠేస్తాను అని చెప్పాను.

అప్పుడు వాడు ఘుబుక్కుని యిలా వంగి (వాడు కొంచెం ఎత్తులే నాకన్నా) నవ్వేసి జెల్లకాయ కొట్టాడు.

ఈ పెద్దాళ్ళెప్పుడూ యింతే.

మన్ని చూసి బయపడ్డపుడు యిలా నవ్వేసి వెళ్ళిపోతారు యేవిటో.

అంతెందుకు. ఇప్పుడు సినిమాలో ఈరో యిలా నించుని ముందస్తుగా నన్ను పెళ్ళిచేసుకో అంటాడా.

దానికి బయం వేస్తుందిగా. అప్పుడది ఇలా నవ్వేసి వెళ్ళిపోతుందా. అప్పుడు వీడు గాఠిగా పాట పాడేస్తాడు. అది హడ్డిలిపోయి పరిగెట్టుతుంది ఇంకోపాట పాడుతూ.

ఈరో కూడా పరుగెడతాడుగా.

పరిగెడతారు అనకూడదట. డానుసు అనాలి అని బాబాయి చెప్పాడు.




యేం సీత ఇలా డానుసు చేస్తుందా. ఈరో ఇంకా గబగబా డానుసు చేస్తాడు. ఎంత గబగబా అయినాసరే అది దొరకదులే, కొంచెం సేపటికి ఇంక డానుసు చెయ్యలేక ఆగిపోతుంది.

అప్పుడు ఈరో వచ్చి, నన్ను పేమించుతావా అంటాడు గదా.

ప్రేమించుతావా అంటే నాకు తెలీదు.

బాబాయికీ తెలీదుట.

ఎవరికీ తెలీదు అని నాన్న చెప్పాడు.

యేం, అప్పుడు సీత ప్రేమించుతాను అంటుంది.

నిజంగానే అంటాడు ఈరో, అలాని సీత చెయ్యి గాఠిగా పట్టుకుంటాడు.

నిజంగానో కాదో చూట్టానికని, మళ్ళీ పాట పాడతాడు చెయ్యిపట్టుకుని, ఇంక సీత పారిపోలేదుగా.

అప్పుడు సీత వాడివేపు యిలా చూస్తుంది.

యింక ఏడిపించకూడదని వాడు పాట మానేస్తాడు.

## (హింట్రబెల్)

సీరాముడికి ఒక్క కొడుకు చాలతే




## వంటింట్లో వందరూపాయల కేసు ఖద



బాబోయ్ అని గాఠిగా కేకపెట్టేసింది బామ్మ.

ముందస్తుగా బాబాయి, డికెక్టివ్రావూ హడ్డిలిపోయారు, నేను కూడా కుంచెం హడ్డిలిపోయాను.

ఎందుకంటే, బామ్మ అలా కేకవేస్తే మనికి డేంజరులే.

తేలుకుట్టితే బామ్మ అలా బాబోయ్ అంటుంది.

యేం, ఒక్కోసారి మనం జటకా తోలడానికి బీడీలు తెస్తామా. అవి బామ్మ వత్తులపెటిలో దాచుకుంటామా.

బామ్మ అవి చూసినాసరే తేలు కుట్టినలాగే బాబాయ్ అంటుంది.

ఇప్పుడు ఏం జరిగిందీ అని అవమానం వేసింది.

వురేయ్ బాబాయ్ బామ్మ పిలుస్తోందిరా నిన్నే అని చెప్పాను.

బాబాయి కాదురోయ్ బాబోయ్ అందీ అని చెప్పాడు బాబాయి.

మీ అమ్మ నిన్ను అస్సలు బాబాయి అని పిలవదుగా అని చెప్పాడు డికెక్టివురావు.

అప్పుడు బాబాయి ఇలా ఎగ్గిరిపోయి, భలే భలే భలేగా చెప్పావు అని డికెక్టివురావు బుజంమీద ఘట్టిగా కొట్టేశాడు.

వాడు పాపం, అరుగుమీంచి దభీమని పడిపోయేశాడు.

డికెక్టీవురావు అంటే నాకు తెలీదు. బాబాయికీ తెలీదు. వాడికి కూడా తెలీదట.

వాడీకి ఖూనీలు అంటే యిష్టంట, ఖూనీలు అంటే నాకు తెలీదు.

డికెక్టివురావుకి పేద్ద మీసాలున్నాయి.

డికెక్టింగు చేసినప్పుడు అవి పెట్టుకోవాలిట. అప్పుడు టుపాకీకూడా పట్టుకోవాలిట.

యేం? డికెక్టివురావు మళ్ళీ మెట్లు ఎక్కి అరుగుమీద కూచున్నాడా!

అప్పుడేమో, బాబాయి, వురేయ్ బుడుగూ లోపలకెళ్ళి బామ్మ ఎందుకు బాబోయ్ అందో చూసిరారా అని చెప్పాడు.

నాకు బయ్యం వేసింది. బామ్మకి తేలు కుట్టితే పరవాలేదనుకో. అక్కడ బీడీ వుంటే యెలా, అప్పుడు ప్రెవేటు చెప్పేస్తుందికదా. మరి.

నేను వెళ్ళను బాబాయీ అని చెప్పేశా.

మరి నువ్వు బీడీలు అక్కడెందుకు దాచావూ అన్నాడు బాబాయి కోపంగా.




మరి గూటిలో పెట్టితే నువు కాలిచేస్తున్నావుగా అని చెప్పాను.

ఇంకా వున్నాయా బీడీలు అన్నాడు డికెక్టివురావు ఆసిగా.

నువు డికెక్టివిగా చెప్పుకో చూద్దాం అన్నాడు బాబాయి.

డికెక్టివికి ఇలాటివి అన్నీ తెలుస్తాయిట.

కాని వీడికి తెలీదనుకో.

ఇలా విరిగిపోయిన అద్దంముక్కలోంచి బాబాయిని చూసి వుంటాయి అన్నాడు.

బాబాయేమో నవ్వేసి ఉండవులే అన్నాడు.

ఇంతట్లో ఇంటిలో యింకా గొడవ అయిపోయింది. అయ్యో హయ్యో అని కేకలు వేస్తున్నారు.

నాక్కూడా బయం వేసింది.

చూడరా బుడుగూ అన్నాడు బాబాయి.

నేను చెప్పనా చూడకుండానే అని అడిగాడు డికెక్ష్టివురావు.

చెప్పు అన్నాడు బాబాయి.

ఖూనీ అన్నాడు డికెక్ష్టివాడు.

హయ్యబాబోయ్ ఖూనీయే ఎవర్నీ అన్నాడు బాబాయి యిలా హడిలిపోయి.

ఖూనీ అంటే ఏమిట్రా అన్నాను నేను.

ఫది రూపాయలో, ఒక బీడీయో ఇస్తే చెప్తాను అన్నాడు డికెక్ష్టివు.

వురేయ్ బుడుగూ యిలారా అని అమ్మ పిలిచింది ఇంతట్లోకి.

☆ ☆ ☆

అప్పుడేమో బుడుగు బయపడిపోయాడు.

డికెక్ష్టివురావు బుడుగుని దగ్గిర్గా కావలించుకునేసి వెళ్లకు బుడుగూ కూనీ కూనీ టుపాకీ పేలిచేస్తారు అన్నాడు.

బుడుగూ బాబ్బోయ్ బాబోయ్ అన్నాడు పాపం ఏడుచుతూ.

యిక్కడే వున్నానురా బయపడకు అన్నాడు బాబాయి.

బాబాయి కాదు బాబోయ్, బాబోయి అన్నాను బాబాయ్ అని ఘట్టిగా చెప్పాడు బుడుగు.

యేం యేం అన్నాడు డికెక్ష్టివురావు.

వెదవా నీ మీసాలూ, చొక్కా గుండుసూదీ గుచుకున్నాయి నాకు అని వాడి గుండుమీద (చిన్న క్రాపింగు ఉందిలే ఆ బోడివెదవకి) కొట్టేశాడు బుడుగు.




వురేయ్ బుడుగూ నిన్నేరా ఇలా రా అని పిలిచింది ఒక ఆడగొంతుక.

ఆడది పిలుస్తోంది అని చెప్పేశాడు డికెక్ష్టిరావు అటుకేసి బయంగాచూస్తూ.

మా అమ్మ అని చెప్పాడు బుడుగు.

ఔను మా వదిన అని చెప్పాడు బాబాయి.

అయితే రొండు గొంతుక అన్నమాట. చూశావా, ఒక్క కూనీలవాడు ఒక్క టుపాకితో నించుని రొండు గొంతుకలతో పిలుస్తున్నాడు. ఈ కేసు చాలా చిత్రంగా ఉంది అని చెప్పేశాడు డికెష్టివాడు.

కాదు ఒకటేరా, మా వదినే వాళ్ళమ్మకదా అన్నాడు బాబాయి.

యేమో హంతకుడు దొరికితే కాని ఆ సంగతి చెప్పలేను అన్నాడు డికెష్టిరావు అద్దంముక్కలోంచి చూస్తూ.

వాడి మాటలు బుడుక్కి తెలీలేదుకాని బాబాయికి తెలిశాయి.

మరి మనకి ఎలా తెలుస్తుంది అని అడిగాడు బాబాయి.

మనంలోపలికి వెళ్ళి చూద్దాం అన్నాడు వాడు.

మరేమో, ఒక ఫిష్టోలు, సిగరెట్టు, ఒక ఓరు కోటు (పేద్దదిట), యింకా రెండు మీసాలు, కుంచెం రత్తం, మళ్ళీనేమో ఒక రెండు జెడల సీతా కావాలి అని చెప్పాడు వాడు.

సీత అంటే బాబాయికి కోపం వచ్చేసింది. బుడుగుకీ బోల్డు హచర్యం వచ్చేసింది.

సీతని పిల్చితే వాళ్ళతాత తంతాడు నేను పిలవను బాబూ అని చెప్పేసాడు బుడుగు.

ఈ సీతకాదూ, అసలు ఏ సీతేనాసరే ఏదో ఒక సీత కావాలి అని చెపాడు డికెష్టి. అయినా బాబాయికి కోపం పోలేదు. ఎందుకు అని అడిగాడు.

ఏంలేదు; తెలుగు డికెష్టినికదా, ఒక్కసారి ఆడసెక్రటీ బుజంమీద చెయేసి నవ్వాలి అన్నాడు డికెష్టి.

ఛంపేస్తుంది తెలుసా? సీత అని చెప్పాడు బాబాయి ఉత్తినే నవ్వినా ఛంపేస్తుందీ, ఇంకా బుజంమీద చెయ్యి పెట్టి నవ్వితే ఇంకా చంపేస్తుంది మరి.

సీత లేకపోతే డికెష్టను చెయ్యడం యెలా అన్నాడు డికెష్టి.

లాపోతే మానెయ్యి అన్నాడు బాబాయి.

వురేయ్ బుడుగూ నిన్నే పిల్చింది చెవుడా యిలారా అంది బుడుగూ వాళ్ళమ్మ మళ్ళీ.

అపుడు బుడుగు లోపలికి వెళ్ళాడు.

మీ బామ్మ బాబాయిని పిల్చిందని చెప్పు అంది అమ్మ. బుడుగు వీదరుగుమీదికి వచ్చి బాబాయిని పిలిచాడు.

బాబాయి లోపలికి కెళ్లి మళ్లీ పరిగెరుకొచ్చాడు.

వంటింటో వందరూపాయలు పోయాయి అని చెప్పాడు ఘట్టిగా

యిది చాలా ఛిత్రమైన కేసు. డికెష్టింగు చేస్తాను. నన్ను అడుగు అన్నాడు డికెష్టి, యిలా కళ్లు యిప్పిచూసి. సరే చెయ్యి అన్నాడు బాబాయి.

అప్పుడు ఆ డికెష్టివాడు జేబులోంచి ఇంకా పేద్దమీసాలు తీసి పెట్టుకుని హూ అన్నాడు.

అనేసి ఘబుక్కున యిలా కింద పడిపోయాడు.

మళ్లీ కుంచెం లేచి, సిగరెట్టు కాల్చి ఫద అని యిలా పాపాయిలాగా పాక్కుతూ లోపలికి వచ్చాడు.

గుర్రం ఎక్కినా డికెష్టివాడూ అని అడిగాడు బుడుగు.

కాని వాడి మీసాలు చూశాక అవమానం వేసి ఎక్కలేదులే.

వాడు అలా లోపలికి పాకిపాకి వంటిల్లుదాక వచ్చాడు.



అమ్మ హడ్డిలిపోయి యేమిటిది బాబోయ్ అంది.

ఫరవాలేదు డికెష్టిలే అని చెప్పాడు బాబాయి. వంటింట్లో వందరూపాయలు ఎక్కడ పోయాయి అని అడిగాడు డికెష్టి.

వంటింటో వంద రూపాయలు కాదూ మామూలు వందరూపాయలే పోయాయీ అని చెప్పాడు బాబాయి.

అంతట్లోకీ బామ్మ హవురా హవురా అని కేకలు పెట్టేసింది.




బయంలేదు బయంలేదు. టుపాకీ యియ్యండి పేలుస్తాను అని చెప్పింది డికెష్టి.

ఎవఁడ్రా నువ్వు ముందరా వెదవ సిగరెట్టు అవతల పారెయ్యి వెధవా. మరేమోనూ వంటింటిలో సిగరెట్టు కాలుస్తావా, ఇంకానే మోనూ నీ సిగరెట్టు మండిపోనూ అని ప్రెవేటు చెప్పింది బామ్మ.

డికెష్టి హడ్డిలిపోయి, సిగరెట్టు పారేసింది.

ఇక్కడకాదు వీధిలో పారెయ్యి అని చెప్పింది బామ్మ.




డికెష్టి లేచి వీధిలో పారేసి మళ్ళీ పాకుతూ వచ్చింది కోపంగా.

వంటింటో వంద రూపాయలు ఎక్కడ పోయాయి అంది మళ్ళీ.

ఏమో తెలీదుఅన్నాడు బాబాయి.

ఎవరూ యేం ముట్టుకోకండి శవం యెక్కడుంది అంది డికెష్టి.

శవం అంటే నాకు తెలీదు. కాని బామ్మకి తెలిసిపోయింది. శవంలేదు నీ శార్దం లేదూ ఎవఁడ్రా నువ్వా ఫో అనేసింది మళ్ళీ.

బాబాయికూడా ఖోపడేశాడు అవన్నీ ఇప్పుడెందుకురా అని.

మరి లాపోతే డికెష్టింగు ఎలా అంది డికెష్టి.

బుడుగుకి బలే బయం వేసింది. వాళ్లమ్మ దగ్గిరికి వెళ్లిపోయాడు. వాళ్లమ్మ బుడుగు వీపుమీద మెల్లిగా కొట్టి బయంలేదమ్మా అని నెత్తిమీద ముద్దుపెట్టుకుని యిలా వాసన చూసింది. అప్పుడు బుడుగుకి బయం పోయింది.

యేం? డికెష్టి యిలా పాకుతూనే వంటిల్లు అంతా అద్దం ముక్కలోంచి చూస్తున్నాడు.

బామ్మకి కోపంపోయి హాచర్యం వచ్చేసింది.

ఈ పిల్లాడికి చత్వారమా ఏమిటిరా లాపోతే అలా పడుకుని వెతుకుతాడూ అంది.

అప్పుడు డికెష్టి లేచికూచుని యిలా నవ్వాడు.

నవ్వీ, అదికాదండి బామ్మగారూ ముందస్తుగా రక్తం ఎక్కడుందో వెతకాలీ అని చెప్పాడు.

అప్పుడు బామ్మ చీపురు కట్టతీసి, పోతావా లాపోతే చితక్కొట్టనా అంది.

బాబాయేమో వద్దని చెప్పాడు. వెతక్కపోతే వందరూపాయలూ దొరకవు కదా అన్నాడు.

అంతట్లోకి నాన వచేశాడు ఆఫీసునుంచి.

గోపాళం అంటూ బామ్మ, అమ్మ, బాబాయి అందరూ వెళ్ళిపోయారు.

డికెష్టి బుడుగుని పిల్చి, ఎవరు బుడుగూ అన్నాడు.

బుడుగూవాళ్ళ నాన్న గోపాళంరా అని చెప్పాడు బుడుగు.

ఓహో మీ నానతో ఎవరో వచ్చారే అన్నాడు డికెష్టి.

బుడుగు కుంచెం అవతలి గదిలోకి వెళ్ళి చూసివచ్చి, వాడూ, లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడులే అని చెప్పాడు.

ఔనుకానీ మీ నానని కొంచెం అర్జెంటుగా పిలు అన్నాడు డికెష్టి.

సరే అని బుడుగు, వాళ్ళ నానావాళు దగ్గిరికి వెళ్ళి డికెష్టి పిలుస్తోందీ రండీ అని చెప్పాడు.

నానా వాళ్లు, యెలా పోయింది డబ్బు యెలా పోయింది అంటూ నా వెనకాతలే వంటింటోకి వచ్చారు.

కాని హాచర్యం!

డికెష్టి ఏడీ! వాడు కూడా పోయాడు!

హరె! మ్మాయం అయిపోయాడే!

బాబాయి, నాన్నా, అమ్మ, బామ్మ లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడూ అంధరూ హాచర్యపడి పోయేశారు. డికెష్టి ఘుబుకున ఎలా మాయం అయిపోయాడూ అని.

వక్క శవంకూడా లేదు. కుంచెం రత్తంకూడా లేదు. కూనీ జరిగిందేమో అన్నాడు బాబాయి.

ఛప్ అని కోప్పడాడు నాన్న.

మనందరం యిక్కడే వున్నాం గదా అంది అమ్మ.

పెరటి తలుపు తాళం వేశాను కూడా అంది బామ్మ.

డికెష్టి ఏమైపోయింది?

వంటింటిలో వందరూపాయల నోటూ, ఒక మీసాల డికెష్టివాడూ పోయారా అసలే మేమందరం హాచెర్యపడి పోయేస్తున్నాం గదా.

అంతట్లోకీ ఇంకో డికెష్టిలాంటి పేద్దవాడు గారిగా నవ్వేస్తూ యిలా వంగి పోయి పరుగెరుకుని వచ్చేశాడు లోపలికి. అప్పుడు మేం ఇంకా బోల్డు హాచెర్య పడిపోయాం.




ఇదేమిటే ఇంకో డికెష్టీ వచ్చింది అంది బామ్మ.

అప్పుడు ఆ లావుపాటివాడు బామ్మకి దండం పెట్టేశాడు.

బామ్మగారూ మరేమోనూ నేనేమో డికెష్టివాడిని కానూ అని చెప్పాడు. ఇంకానేమోనూ, నేను ఎలష్కనుకి వచ్చాను. ఓటు కావాలీ అన్నాడు.



ఎలష్కను అంటే మంతిరి అవడం. ఇలాని బాబాయి చెప్పాడు. దాని కోసం మన ఓటు ఇయ్యాలిట. ఓటు అంటే నాకు తెలీదు.

యేం అప్పుడు బామ్మకి కోపం వచ్చేసింది. వుండవయ్యా, డికెషివాడు కనబడలేదూ, అసలే మేం హాచెరంగా ఉంటేనూ హూ, అలాని అంది.



అప్పుడు నాన ఇంగిలీషులో ఎలష్కను వాడితో ఏదో చెప్పాడు.

వాడేమో హో యింతేనా అని గారిగా నవేశాడు. డికెష్టి అంటే ఆ మీసాల వాడేనా అని అడిగాడు

నిజెం మీసాలు కావులెండి.

డికెష్టింగుమీసాలు అని చెప్పాడు బాబాయి.




వాడు నాకు తెలుసులెండి... అన్నాడు ఎలష్కనువాడు. అని మళ్ళీనేమో నాన్నని దగిరికి పిలిచాడు.

పిలిచి, ఈ డికెక్టివాడు మీకు ఛాలా డబ్బు బాకీ వున్నాడా అన్నాడు. అప్పుడేమో లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడేమో నాకు బాకీ అండీ అని చెప్పాడు.

హో హో అన్నాడు ఎలష్కనువాడు. హో హో అని బాబాయి కూడా అన్నాడు.

తరువాత ఎలష్కనువాడేమో యిలా కళ్లు మూసుకుని వురేయ్ డికెక్టివాడూ డికెక్టివాడూ పిన్నిగారి ముగుడు ఏం అనడులే, నేను పది రూపాయలు అప్పు ఇస్తానులే దామ్మా దా దామ్మా దా అని అరిచాడు.

నిజంగానే? అని ఎవరో అన్నారు.




కాని కనబడలేదు.

నిజంగానే ఒరు అన్నాడు ఎలష్కనువాడు.

అప్పుడేమో, డికెక్టివాడు దభీమని కిందపడ్డాడు అటకమీంచి.

హోరినీ అన్నాడు బాబాయి హాచెర్యపడి. అందరూ నవ్వేశారు.

అప్పుడేమో ఎలష్కనువాడు ఓటు నా వోటు వోటు అన్నాడు.

నువ్వు మంతిరివి అయితే మరి మా యింటికీ పక్కింటి పిన్నిగారింటికీ వెల్లవేస్తావా అని అడిగింది బామ్మ.

ఓ అన్నాడు ఓటువాడు.

మళ్ళీనేమో అల్ల ఎదురింటికి వెల్ల వెయ్యకూడదు మరి అంది బామ్మ. ఓ అన్నాడు ఓట్లవాడు.

మరి నన్ను జెటకా తోలనిస్తావా అని అడిగాను నేను.




ఓ మీనాన్న నాకు ఓటిస్తే తప్పకుండా తోలుతావు అన్నాడు ఓట్లవాడు.

హో హో మీ ఓటు నాకే అన్నాడు ఓట్లు వాడు మళ్ళీ.

నాకు డికెక్టింగు కేసులు ఇస్తారండీ అన్నాడు డికెక్టివాడు.

నాకు ఓటిస్తే నీకు బోల్డు కేసులు అని చెప్పాడు ఓట్లువాడు.

ఇంతట్లోకే యెవరో రెండుజెడల సీత వచ్చింది.

యేవండీ అని పిలిచింది వీదిలోంచి.

బాబాయి ఒక్కసారి ఓయ్ అనేసి పరిగెత్తాడు. అప్పుడు నేనూ వెళ్ళాను.

ఆ సీత ఇంచక్కా ఉందిలే. మీ ఓటు మాకు ఇస్తారుగదండీ అంది ఆ సీత.

వ్వో.......నా ఓటు, మా అమ్మ ఓటూ, అన్నదీ, వదినదీ, పక్కింటి వాళ్ళదీ, ఈ ఊరివాళ్ళ వోటులు అన్నీ మీకే ఇచ్చేస్తాను అన్నాడు బాబాయి యిలా డానుసు చేసేసి, కాళ్ళూ చేతులూ ముడివేసేసుకుని.




అప్పుడు నేనుకూడ ఓటిస్తాను అన్నాను. అప్పుడు సీత సరేనని యిలా వంగి నన్ను కుంచెం ముద్దుపెట్టుకుంది.

నా వోటుకూడా తీసుకోండి అన్నాడు బాబాయ్.

సరే అండి అని నవ్వేసి వెళిపోయింది సీత.

యేం, వోటు అంటే ముద్దు అని అర్థమా బాబాయి అని అడిగానా-

అంతట్లోకి యింకో పేద్ద మీసాలవాడు ఘబ గబా పరుగేటుకు వచ్చేశాడు. నన్ను ఇలా ఎత్తుకునేసి, బోల్డు ముద్దులు పెట్టుకునేసి మీ వోట్లు మాకే అని బాబాయికి చెప్పి మళ్ళీ పరిగేరు కెళిపోయాడు.

ఓటు అంటే ముద్దుకాదురా బుడుగూ అని చెప్పాడు బాబాయి అపుడు.

యేం. అపుడు మా యింటిలోపల ఉన్న ఎలష్కనువాడు వచ్చి, మీ వోటు మాకే అని మళ్ళీ చెప్పేసి వెళ్ళిపోయాడు.

హమ్మయ్య అన్నాడు నాన్న.

వందరూపాయలూ పోయాయిగదా అంది అమ్మ.

ఈ ఓట్లువాడిని వెతికిపెట్టమంటే సరి అంది బామ్మ.

అబ్బే వద్దండి నేనే డికెక్టింగు చేసేస్తాను. ఒక్క సెవంకూడా లేదూ, ఉంటే ఇందాకళే డికెక్టు చేద్దునూ అన్నాడు.

నానా వాళ్ళూ కోపంగా వెళ్ళిపోయారు లోపలికి.

ఎలాగరా అన్నాడు బాబాయి.

అప్పుడేమో డికెష్టివాడు నన్ను పిలిచి, బుడుగూ బుడుగూ నీ దగ్గర పాత జెటకా బీడీలు వుంటే ఒక్కటి యియ్యి చెప్తాను అన్నాడు.

నాకు జాలేసింది, సరే ఒక్కటే ఇస్తాను అని చెప్పా.

వాడూ నాతో వచ్చాడు యిలా అద్దంలోంచి చూస్తూ.

నేను నా సందుగా పెట్టి తీసి, అందులో బామ్మ వత్తుల పెట్టె తీసి, కుంచెం దూదిఉంటే అదికూడా తీసి, బీడీకోసం చూశానా.

ద్దొరిక్కింది అనేసి డికెష్టివాడు గాఠిగా అరిచేశాడు.

నేను హడ్డిలిపోయానులే.

అమ్మ, నానా, బాబాయి, బామ్మ అంధరూ వచ్చేశారు యేవిటీ యేవిటీ అంటూ.

ఇగ్గో వంటింటో వందరూపాయల కేసు, మీ బుడుగు వత్తుల పెట్టిలో ఉంది అన్నాడు డికెష్టివాడు.

అది నావత్తుల పెట్టి అంది బామ్మ.



కాదూ, నేను గోళీకాయలు దాచుకున్నాను, నాదీ అని చెప్పేశాను నేను.

కాని అందులో బామ్మ వంటింట్లో వంద రూపాయల కేసు దాచిందని నాకేం తెలుసు. వృత్తినే వత్తులు పెట్టుకుంది అనుకున్నాను.

వీడే హంతకుడు అన్నాడు డికెక్టివాడు. అప్పుడు యెంత హాశ్చెర్యం పడిపోయానో తెలుసా. తెలీదనుకో.

# నన్ను బళ్లో పడెయ్యడం

మా రాధా, గోపాళం, బామ్మా, మరేమో బాబాయీ వీళ్లందరూ నన్ను ఎలాగేనా బళ్లో పెట్టెయ్యాలని చూస్తున్నారు.

ఇలాని బాబ్బాయి చెప్పాడులే.

మన్ని బళ్లో పెట్టేస్తే మన తెలివితేటలు అన్నీ పోతాయిట.

ఇలా అంటే నాకు తెలీదు కాని బాబాయి చెప్పాడనుకో.

అందుకని తెలివితేటలు అయిపోకుండా నేను కుంచెంమందిని రక్షించా లనుకున్నాను.

యెందుకంటే నన్ను కుంచెం బోల్డు ఛాలామంది సలహాలు అడుగుతున్నారు.

సలహాలు అంటే కోతలుట. ఇలాని కూడా బాబాయే చెప్పాడు. కోతలు అంటే నాకు తెలీదుట.

ఇప్పుడు నాకు ఉత్తరాలు రాశారు కాబట్టి సలహాలు చెప్తాను. మన దగ్గిర లేకపోయినా సరే ఇవి మనం ఇవ్వాలిట.

ఇదిగో ఓ కుర్రాడు పాపం ఉత్తరం రాశాడు చూడు.

బడుగూ, మరేమోనేం మా అమ్మావాళ్ళూ రోజూ నన్ను బళ్లోకి వెళ్ళమంటున్నారు. లాపోతే కొట్టుతాను అంటున్నారు. ఎలాగ?

ముందస్తుగా నాకు కోపం వస్తుంది. ఎందుకంటే వీడు నన్ను అనుమానం చేస్తున్నాడు కదా. నాపేరు బుడుగు అయినా వీడు బడుగు అని. ఎందుకు రాయాలీ, అందుకే.



అయినా వాడి ఖష్టాలు చూస్తే జాలి వేస్తోందిగదా మనకి.

అసలు నీ చిన్నప్పటినించీ, మీ తాతయ్య చిన్నప్పటినించీ చిన్నపిల్లలు ఎప్పుడూ ఇలా కష్టపడుతూనే ఉన్నారు. అందరు చిన్నపిల్లలినీ ఇలా బళ్ళో పెట్టెయ్యడమే.

పోనీ ఏదో ఫ్ఫదిరోజులికి ఒకసారి వెళ్లితే చాలదుట. రోఝూ వెళ్లాలిట.

మళ్ళీ యీ పెద్దవాళ్ళందరూ చిన్నప్పుడు ఇలా కష్టపడి నవాళ్ళే. అయినా పెద్దయ్యాక ఇప్పుడు చిన్న చిన్న పిల్లలిని బళ్ళో పెటేస్తున్నారు.

అంతెందుకులే. పాపం నన్ను కూడా రేపో మూడ్రోలుకో బళ్ళో పెట్టాలని చూస్తున్నారు గదా. నన్నేం చెయ్యలేరనుకో.

అయినా చిన్నవాళ్లూ చితకవాళ్లూ బళ్ళో కెళ్ళకుండా ఉండడానికని కొన్ని సంగతులు చెప్తాను.

# సంహాలు

ఒకటి: జెరం వచ్చిందని చెప్పాలి. మనంచెప్తే నమ్మరుగదా. అందికని యేం చెయ్యాలంటే. ముందుస్తుగా చొక్కా యిప్పేసుకోవాలి. అప్పుడేమో ఎండలో నిలబడాలి చాలా సేపు. అప్పుడు వీపుమీద, పొట్టమీద జెరం వచ్చేస్తుంది.

అప్పుడు పరిగేరుకుని అమ్మ దగ్గిరికి వెళ్ళాలి అమ్మోయి జెరం జెరం గబగబా చూడూ, బళ్ళోకి వెళ్ళద్దని చెప్పూ అని చెప్పాలన్నమాట.

ఇంకోటి: జెరం రాగానే పరిగేరు కెళ్ళి చెప్పాలి తెలుసా.

లాపోతే, జెరం చల్లారిపోతుంది.

ఉంకోటి కూడాను. ఇలాంటి దానికి అసలు బామ్మ మంచిది. బామ్మకి చెప్పేస్తే చాలు, అప్పుడు అదే అమ్మకి చెప్తుంది.

రెండు: కుంచెం మంది పిల్లలు కడుపునెప్పి అని అంటారుకాని అది మంచిదికాదులే. రెండుసార్లో, ఫదిసార్లో అయాకా, అమ్మా వాళ్లూ కారప్పూసా పకోడీలు చేసుకుని మనికి పెట్టకుండా తినేస్తారు.

యిప్పుడు లేదుగదే అమ్మా అని చెప్పినా సరే పెట్టరు. ఇప్పుడు లేకపోతే రేపో ప్లది రోలుకో వస్తుందిగా అందుకని వద్దూ అని అంటారు.

అందుకని తలనొప్పి అన్నింటికన్నా మంచిది. ముందస్తుగా అమ్మ నమ్మదు అనుకో. అయిన సరే మనం తలనొప్పి తలనొప్పి అని ఫదిసార్లో వందసార్లో చెబితే కుంచెం నమ్ముతారు. ఇదికూడా ముందస్తుగా బామ్మకే చెప్పాలి అమ్మకి చెపితే లాబంలేదు.

బడికి రోఝూ వెళ్ళాలిట!



అసలు ఏం-చేసినా లాబం లేదు. ఎలాగేనా బళ్ళోకి వెళ్ళాలిలే. అందుకని కుంచెం ఎలాగో చాలా కష్టపడి రోఝూ బళ్ళోకే పోవడం మంచిది. గబగబా గబగబా చదివి పారేస్తే ఘుబుక్కుని పెద్దాళయిపోతాంగా. అప్పుడు ఇంచక్కా ఎప్పుడూ బడి మానెయ్యొచ్చు.

యింకోటి, మా బాబాయంత పెద్దవాళ్ళు అయ్యాకా, అసలు ఇంక బళ్ళోకి వెళ్ళద్దంటారులే.

మా బాబాయి అంతేగా బళ్ళోకి వెళ్తాను వెళ్తాను అంటాడు. బామ్మా, నాన్న, యింకా చాల్లే, అఫీసుకి వెళ్ళిపో అంటారు. అదన్నమాట.

ఈ పెద్దవాళెప్పుడూ యింతే. మనం వెళ్తాం అంటే వద్దూ అని అంటారు. మనం వెళ్ళను ఒద్దూ అంటే, వెళ్ళూ వెళ్ళూ బళ్ళో కెళ్ళూ బడిదొంగా బజారుగెద్దా అంటారు. యెలాగ.

ఇంకో ఉత్తరం చూడు. వీడు కుంచెం పెద్ద కుఱ్ఱాడిలా వున్నాడు.

వురేయ్ వురేయి బుడుగూ మరేమోనూ మా అమ్మా నాన్నా డబ్బులు అసలు ఈటంలేదూ ఎలాగరా మరీ అని రాశాడు గదా.

ఇది కూడా చాలా కష్టమే. అసలు డబ్బులు అంటే చాలామందికి చాలా యిష్టంట. నాక్కూడా కుంచెం యిష్టమే ననుకో.

కానీ ఏంచేస్తాం. చిన్న పిల్లలికీ, కాలేజీకి వెళ్ళే బాబాయిలకీ డబ్బులు చాలా యివ్వరు. అడిగినా సరే.

కాని అబద్ధం చెప్తే చాలా డబ్బులు ఇస్తారుట. బాబాయి యిలాగే చేస్తాడుట.

మళ్ళీ నేమో, నాన్నకి అమ్మ డబ్బులు ఇవ్వదు కదా. ఎందుకూ అంటుంది. అప్పుడు నాన్న కుంచెం అబద్దాలు చెప్పుతాడుట.

చిన్నపిల్లలు మాత్తరం అబద్ధం చెప్పకూడదుట. చెప్పితే కొట్టుతారు.

కాని మనం నిజెం చెప్పుతాను అంటే కొంచెమంది పెద్దవాళ్లు డబ్బు లిస్తారులే.

ఇప్పుడు మా లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడు లేడూ. వాడేం బీడీలు కాలుస్తాడులే.

బీడీలు కాలచడం అంటే తప్పుకదా. ఊరికే జెటకా తోలడానికి దాచుకోవాలి అంతే. కాని వీడు నిజెంగా కాలిచేస్తాడు గదా. లావుపాటి పక్కింటి పిన్నిగారు వాడికి చెప్పిందిలే వురేయ్ ముగుడూ అలా బీడీలూ కాలచకూడదూ అని.

అయినా వాడు మా యింటికి వచ్చి నాన దగ్గిర కూచుని కాలుచుతాడు గదా.

అప్పుడేమో నేను వురేయ్ వురేయ్ నీ సంగతి చెప్పుతా ఉండూ అని అంటాను గదా. వాడు ఘబుకుని నన్ను ముద్దు పెటేసుకుని ఓ కాణీయో ప్రదణాలో యిచ్చేసి చెప్పకమ్మా బుడుగూ తప్పమ్మా ఒద్దమ్మా యిలాని ఏడుచుతాడు.

అప్పుడు నేనేమో పోనీలే అని, యేవండీ లావుపాటి పక్కింటి పిన్నిగారూ, మరేమోనూ, మీ ముగుడేమో మా నాన్నతో కలిసి బీడీలు కాలచలేదండీ అని అబద్దాలు చేసేస్తాను.

ఏవిటో నేను యెప్పుడూ ఇలా అందరినీ రక్షించుతానులే.

## డబ్బులు తెచ్చుకోడం—



ఇలాగ కూడా మనం డబ్బులు తెచ్చుకోవచ్చును.

నాకు చాలా బోల్డు డబ్బులు కావాలనుకో. ఒక పుస్తకం రాసిస్తే వస్తాయిట. బాబాయి చెప్పాడులే. నేను ఓటి రాస్తున్నాను.

నీకూ డబ్బులు కావలిస్తే నువ్వూ ఫ్ఫది ఫుస్తకాలు రాసెయ్యి.




పుస్తకాలు రాసెయ్యి అంటే నాకు తెలీదు. అయినాసరే మనం రాసెయ్యచ్చు డబ్బులు కావాలి కదా మరి.

డబ్బులు చాలా ఉంటే, మనం సీగానపెసునాంబని సినిమాకి తీసికెళ్లచ్చును. నేను అలాగే తీసి కెళ్లుతాను సీగానపెసూనాంబని.

రేపో మూడ్రోలుకో యేమయింది తెలుసా?

నేను గడియార స్పంబం దగ్గిరికి వెళ్ళాను.

అక్కడ జెటకాలు ఉన్నాయికదా మాయింటికి రావోయి అని పిలిచాను. వాళ్లు నేను రానుబాబు అని చెప్పారు. నేనంటే బయంలే.

యెలాగ? అప్పుడు ఉంకో చివరలో జెటకా ఉందిగదా. జెటకా బండీవాడు లేడు. నేనే ఆ జెటకా ఎక్కిపోయి కొరడా పట్టుకుని ఛెల్ మన్నాను.

జెటకా ఝూంమని పరుగెత్తి పోయింది. నాకు బయం వేసిందిలే కుంచెం. అంతట్లోకే నిజెంబండివాడూ ఉంకోపోలీసువాడూ బండీని ఆపేసి లాక్కొన్నారు.

మనం కుర్రాళ్ళం అని కదా.

అందుకని నువ్వు ఎప్పుడేనా జెటకా తోలాలని వుంటే, మా నానకోటు తొడుకొని. మా నాన్న కళ్ళజోడు పెట్టుకొని వెళ్ళాలి లాపోతే నిన్ను కూడా పోలీసువాడూ, నిజెం జెటకావాడూ పట్టుకుంటారు.

బురుగూ మరీ. మనం నీల్లోసుకుంతున్నపురూ, సీగాన సెసూనాంబ వత్తే ఎలాగ అని అడుగుతున్నారు ఉంకో కుర్రాడు.

చాలా ఖష్టం. అందికే మనం రోజా నీళ్లోసుకోకూడదని నాలాంటివాళ్లు చెప్తున్నారు.

కాని పెద్దవాళ్లు మన్ని పెంచుతాను అంటారుగా అందుకని అసయ్యంగా రోజా నీళ్లోసుకోమని అంటారు.

ఏం చెయ్యాలంటే, నువురావద్దులే అమ్మా నేనే పోసుకుంటానునీళ్ళూ అని చెప్పే సెయ్యాలి ముందస్తుగా.

మనం నీళ్లోసుకుంటున్నప్పుడు
సీగానపెసూనాంబ వస్తే....

అప్పుడేమో నీళ్లగది తలుపేసేసి, సబ్బుని తడిపి అరగతీసెయ్యి. కాసేపు ఉత్తినే కూచో తరువాత కుంచెం నీళ్లు నెత్తిమీద జల్లుకోవాలి. ఏంచేస్తాం మరి. అప్పుడు దేగిసాలో నీళ్ళు అన్నీ పారపోసేసి హమ్మయ్య అని ఇంటిలోకి వెళ్లాలి.

అయిసుఫ్రూటు కొనుక్కోడం ఎలాగ బుడుగూ అని ఉంకో ఉత్తరం వచ్చింది.

ఏమిటంటే ముందస్తుగా అమ్మ చూడకుండా వాడిని పిలిచి అయిసు ఫ్రూటులు రెండు యిమ్మని ఎంగిలి చేసెయ్యాలి. అప్పుడు అమ్మకు చెప్తే ఇంచక్కా కొని పెట్టుతుంది.

తరవాత కుంచెం సేపు ప్రెవేటు చెప్పేస్తుందనుకో.

ఈ పెరపెంచకంలో ప్రెవేటు లేకుండా మనికి యేంరాదుగదా మరి.

## కొత్త సమస్తరం



ఓ సీ గానపెసూనాంబా, ఇప్పుడేమోనూ మరేమోనూ కొత్తసమస్తరం వచ్చిందిగదా. నేను కుంచెం ఇపుడు పంచాంగం చెపుతాను గదా.

మరేమో బామ్మ కళ్ళజోడు వెతుక్కుని నా దగ్గిర లాక్కుని వెళ్లి పోతుంది. అందుకని చెప్పేన రా. ముందస్తుగా ఏమిటంటే యీ కొత్త సమ్మస్తరంలో మనకి కొత్తకాణీలు వచ్చాయి. అవి అస్సలు దమ్మిడీలు అనుకో. కాని మనం కాణీలు అని అబద్ధం చెప్పాలిట.

ఇలాంటి అబద్ధం చెప్పినా తప్పులేదుట. ఇలాని నాన్న చెప్పాడులే.

మరి ఈ దంబిడీకాణీకి యేం రాదుట తెలుసా. పకోడీలు రావు. అయిసు ఫ్రూట్లులూ రావు, జెటకాలూ రావు, ఆఖరికి రైలింజనులు కూడా రావు. యేమీ రావు.

అందుకని ఇంక కొత్త సమస్తరంలో చిన్న పిల్లలు (నేను కాదులే) అమ్మా కాణీయే అనకూడదు. అమ్మా ఫదికాణీలే అని చెప్పాలి. లాపోతే చాలా కష్టం. ఒక్క కాణీ ఏనా మూఢు కాణీలేనా అడిగితే ఏం రాదుగా.

మళ్ళీనేమో లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడిని ఒక్కరాయితో కొట్టితే ఒక్క కాణీయే ఇస్తాడుగా. అందుకని ఫదిరాళ్ళతో కొట్టాలి.

వాడు బీడీలు కాలచలేదని లావుపాటి పిన్నిగారితో ఫదిసార్లు అబద్ధం చెప్పాలి. ఒక్కసారి చెబితే ఒక్కకాణీయే ఇస్తాడు వాడు అందుకూ.

ఏం చేస్తాం మరి.

ఇగో మరే లావుపాటి పక్కింటి పిన్నిగారు ఇంకా లావుపాటి అయిపోతుందిట. నేను రేపో మూ్ర్డోలుకో అడిగానులే.

నా యిష్టం. ఇంకా లావుపాటి అయిపోతాను నీ కెందుకు అని ప్రెవేటు చెప్పేసింది, అదీ సంగతి.

కొత్త సమస్తరంలో మా బాబాయి, మీబాబాయి ఇంకా బోల్డు బోల్డు బాబాయిలు బోల్డు పేద్ద చొక్కాలు తొడుక్కోరుట. కుంచెం కుంచెం చొక్కాలు అంటే నా అంత చిన్న చొక్కాలు తొడుక్కుంటారుట. దానిమీద బొమ్మలు కూడా ఉంటాయేం అవే

మా బాబాయి నిన్నో రేపో ఇంత కుంచెం చొక్కా తొడుకున్నాడులే. అపుడు బామ్మ కోపడేసింది, ఎందుకురా బుడుగూగాడి చొక్కా తొడుకున్నావు అంది గదా.

ఇది బుడుగుది కాదూ నాదేనూ ఇంకట్నించీ అందరూ ఇలాంటి నయాచొక్కాలే తొడుక్కుంటారూ అని చెప్పాడు బాబాయి. నయా చొక్కాలంటే నాకు తెలీదు.

ఓ సీగాన పెసూనాంబా ఇంకట్నించి నువ్వు మూడు జెడలో ఫదిజెడలో వేసుకుంటావు తెలుసా.

రెండు జెడల సీతలందరూ కొత్త సమస్తరంనించి మూడు జెడలు వేసుకుంటారులే. ఇప్పుడే కుంచెం చాలామంది అలా వేసుకుంటున్నారుగా అందికని

ఇంక పాపం చిన్న చిన్న పిల్లలు లేరూ – నా అంతంత వాళ్లు. నేను కుంచెం పెద్దవాడినే అనుకో.

యేం ఈ చిన్న చిన్న పిల్లలందరూ జాగర్తగా ఆడుకోవాలి. లాకపోతే ఘబుకున బళ్ళో పడిపోతారు అంతే.

అందుకని అల్లరి చాలా చెయ్యకుండా కుంచెం అప్పుడప్పుడు చదువు కుంటాను అని బయపెట్టాలి. అలా చేస్తే అమ్మా నానా మన్ని బళ్లోపడెయ్యరు.

ఇది కుంచెం చాలా కష్టం అనుకో.మనం ఎంత అల్లరి చెయ్యొద్దురా బుడుగూ అని చెప్పినా వాడు మనమాట వింటం లేదుగదా ఎలా.




యేం – ఎలాగంటే, బాబాయిని ఖద చెప్పమని వినడం. అప్పుడు ఛాలా అల్లరి చెయ్యంగా. ఓసారేం, రేపో, యివాళో నానకి నా మీద కోపం వచ్చిందిగా నేను ఆడుకుంటుంటే. వురేయి బుడుగూ అలా అడ్డబాబాయిలా తిరక్కపోతే పడుకుని నిదరోకూడదూ అన్నాడు గదా. అప్పుడేమో బాబాయికి కోపం వచ్చేసింది. ఎందుకనో. నాన్న వేపు యిలా చూశాడు.

వాడు అల్లరిచేస్తే నన్ను కోపడతావే అనేశాడు కోపంగా. అనేసి వురేయ్ బుడుగూ యిలా రారా చదువుకో అని ఓ బెద్ద పుస్తకం ఇచ్చేశాడు.



నా కసలే పుస్తకాలంటే చాలా యిష్టం కదా. ఖదలుం టాయట వాటిలో పుస్తకం పట్టుకుంటే అయిపోయేదాకా వదల్నుట నేను. ఇలాని బాబాయే చెప్పాడు.

కాని నానకి నేను పుస్తకం పట్టుకున్నా కోపం మరి. కోపం అంటే బయం అని తెలుసుగా. ఇపుడు నేనేమో బళ్ళో పడిపోతానూ పుస్తకం యియ్యా అని బయపెట్టుతాను గదా నానని. అపుడు వాడికి కోపం వచ్చేస్తుంది.

ఇలా రా కూచో అని ఖద చెపుతాడు. లాపోతే బాబాయిని చెప్పరా అంటాడు.

బాబాయికి రెండు జెడల సీతల ఖదలు చాలా వచ్చును కాని అవి బావుండవుగదా. వాడికి అలాడీను ఖదకూడా వచ్చును. నాకు బలే యిష్టంకూడా అది. మాజిక్కుల వాడు వుంటాడేం అదీ. మాజిక్కులవాడు అంటే బుడబుడకల వాడులే.

నానకి కోపం వస్తే అప్పుడు బాబాయి నాకు ఖద చెప్పాడులే.




యేం. అలాడీను ఓ చిన్న పిల్లాడు. వాడు అనగనగా ఉన్నాడు. అసలు చైనావాడులే. జెడేసుకుంటాడు.

యేం. వాడు ఓ రోజున వీధిలో ఆడుకుంటున్నాడు మరి. అపుడేమో బుడబుడకల వాడు వచ్చాడు.




వురేయి, అలాడీనూ నువ్వు గోపాళం వాళ్ల కుడుకు వుగదూ అన్నాడు.

అపుడు అలాడీను నీ కెందుకు ఫోరా అని చెప్పాడు.

బుడబుడకల వాడేమో యిలా నవ్వేసి, నేను ఫోనురా అన్నాడు.

వురేయి అలాడీనూ నువ్వు నాతోటి కుంచెం అలా వస్తావురా పనుంది అడిగాడు.

అలాడీనుకూడా ఇలా నవ్వేసి గ్రుహదగ్గిరకేనా, నీకు మాజికు లైటు కావాలికదూ నాకు తెలుసులే దొంగా అనేశాడు. మాజికులైటు అంటే అరికిను లాంతరు లేదూ అదన్నమాట.

బుడబుడకలవాడు హాచ్చెర్య పడిపోయేశాడు అంతే. అలా పడిపోయేసి మళ్ళీ లేచి. అవునురా హలాడీనూ నీకు ఎలా తెలిసిందిరా అన్నాడు ఇంకా హచెర్యంగా.

హె, ఎలా తెలుస్తుంది, మా బాబాయి చెప్పాడులేరా అన్నాడు అలాడీను.

బుడబుడకలవాడు బయపడి పోయేసి అవునుగాని మరి నాతో వస్తావా. నీకు మంచి మిఠాయి పెట్టుతాను అన్నాడు.

మిఠాయి వద్దు మరేమో నారాయణ కొట్టులో వేడి పకోడీలు కొనిపెట్టితే వస్తానూ లాపోతే రాను ఫో అని చెప్పేశాడు అలాడీను.

అపుడేమో బుడబుడకలవాడూ అలాడీనూ గుర్రంఎక్కి టకటకా టకటకా పేద్ద అడివిలోకి వెళిపోయారన్నమాట పకోడీలు తింటూ.

అపుడేమో అలాడీను మాజిక్కువాడూ టకటకా గ్రుహకి వెళ్ళిపోయారు




అక్కడే గ్రుహ ఉంది. గ్రుహ అంటే నా తలకాయ. ఏదో ఓటిలే. నీ కెందుకు ఖద విను.

యేం. అక్కడేమో గుర్రం దిగిపోయారు. బుడబుడకలవాడు గ్రుహ దగ్గిర నించుని యిలా అని ఏదో మంతరం వేశాడు.

హాచెరం! పేద్ద చప్పుడు ఫేలిపోయింది. భేద్ద మంట ఫొగ వచ్చేశాయి హపుడు.

బుడబుడకలవాడు యిలా బయపడి పోయేసి, హబ్బ ఏం మంటరా ఓరి బాబోయ్ యి అనేశాడు.

కాని అలాడీను అస్సలు బయపడలేదు. బయం అంటే ఏమిటో తెలీదుగా మరి. వాళ్ళ బాబాయి చెప్పలేదులే. వురేయి బయంలేదు బుడబుడకలవాడూ అని చెప్పేశాడు అలాడీను. అపుడేమో వాడు సరేనూ అన్నాడు.

అంతలో ఎవరోవచ్చి యింత చిన్న తలుపు తీశారుగదా.

అలాడీనూ నువు లోపలికి వెళ్ళి అక్కడ మాజిక్కులైటుంది కుంచెం తెచ్చిపెట్టమ్మా అన్నాడు బుడబుడకలవాడు.

మరి నేను చిన్నవాడినీ చితకవాడినీ గదా. నాకు బయం కదా ఎలాగబాబూ నేను వెళ్ళనూ అన్నాడు  అలాడీను.

బుడబుడకలవాడేమో నీకు పరవాలేదులేరా. నీకు వుంగరం ఇస్తా వెళ్ళమ్మా అన్నాడు.

అపుడు సరేనని అలాడీను వెళ్ళి లాంతరు తెచ్చాడు.

లాంతరు నాకిచ్చెయ్యి నువ్వు తరవాత రా అన్నాడు బుడబుడకలవాడు.

నాకు ఫ్హది కాణీలు ఇస్తావా అన్నాడు అలాడీను.

వాడు ఇస్తాను అన్నాడు.

ముందర యియ్యి మరి అన్నాడు అలాడీను.

కాని వాడిదగ్గర నిఝంగా లేవుగా, అందికని కోపంగా లాంతరు యియ్యా లాపోతే మూతపెట్టేస్తాను అంతే అన్నాడు  బుడబుడకలవాడు.

అలాడీనుకు తెలుసుగా వాడు ఎలాగా తలుపేసేస్తాడని. వాళ్ళ బాబాయి ముందస్తుగా చెప్పాడులే. అందికనే కుంచెం  ఏడిపించాడు. ఫదికాణీలు కావాలని.




యేం. అప్పుడేమో మరేమో వాడికి కోపం వచ్చిందిగా. హుం అనేసి తలుపు వేసేశాడు ఢామని. వేసేసి అక్కడే  చచ్చిపో వెదవాని అన్నాడు.

అలాడీను హో హో అని నవ్వేశాడు. నాకు తెలుసులే ఫోరా అన్నాడు. అనేసి ఆ లాంతరులేదూ మాజికు లాంతరు.  ంని మీద యిలా గోకేశాడు. అప్పుడు యింత పెద్ద బూతం వచ్చేసింది. బూతం అంటే పేద్ద రాక్షసి.

లావుపాటి పక్కింటి పిన్నిగారు కన్నా యింఖా లావుగా ఉంటుంది.

అరెరే. అన్నట్లు నువ్వుకాదురా నువ్వు ముందస్తుగా రాకూడదు. హూష్ మాంకాళీ ఫో అన్నాడు అలాడీను  కళ్లు మూసేసుకుని యిలా.

తరవాతేమో, ఆ వుంగరం ఉందిగా. బుడబుడకలవాడు ఇచ్చింది. దాన్ని మెల్లిగా యిలా గోకాడు. అప్పుడేమో  యింత చిన్న బూచివాడు ఒచ్చాడు. వీడు బుడుగు అంత కూడా లేడనుకో.

అపుడు అలాడీను హాచెర్యపడిపోయాడు హా! అని.

బూచివాడేమో ఇంచక్కా నవ్వి ఎందుకండీ అలాడీనుగారూ అలా హాచెర్య పడతారూ, మరేమోనూ ఇది గోకితే నేను వస్తానని మీకు ఇందాకళే తెలుసుగా అన్నాడు.

ఖదలో అలా ఉంది లేవోయి. నువ్వు ముందస్తుగా ఈ గ్రుహ తలుపు తియ్యి అన్నాడు అలాడీను.

నాకు తలుపుతియ్యడం రాదండి. పాపం చిన్నవాడినికదా ఎలా అనేసి యిలా బోల్డు ఏడిచేశాడు ఉంగరం బూచాడు.




అప్పుడు అలాడీనుకి చాలా జాలివేసింది. యేడవకమ్మా బూచాడూ అన్నాడు. కుంచెసేపు అయ్యాకానేమో, ఉంగరం బూచాడు నవ్వేసి పోనీ యీ గ్రుహని మీ యింటి దగ్గిరికి తీసికెళిపోనా అన్నాడు.

కాని అప్పుడు మాత్తరం ఎలా. గ్రుహ తలుపులు రావుగా. నేను ఇందులోనే ఉండిపోవాలీ యీ యీ అని ఏడిచాడు అలాడీను.

హో హో అబా అన్నాడు బూచాడు. నేను తలుపులు తియ్యలేను. కాని, నిన్ను యీ గ్రుహలోంచి అవతలికి తీసుకెళ్ళగలను తెలుసా అన్నాడు వాడు.

అవును తెలుసు కాని మరిచి పోయానులే, మరి తీసుకెళ్లు చప్పునీ అన్నాడు అలాడీను.

వ్వ్యాష్ మాంకాళీ అనేసరికి యిద్దరూ గ్రుహ అవతలికి వెళిపోయారు.

ఇప్పుడు మీ యింటిదగ్గిరికి తీసుకెళిపోనా అని అడిగాడు బూచాడు.

ఏం ఒద్దులే, ఒక నిఝుం జెటకా తెచ్చిపెట్టు చెప్తాను అన్నాడు అలాడీను.

అప్పుడేమో ఆ జెటకా ఎక్కి వాడే తోలుకుని ఝూంమని వాళ్ళింటికి వెళిపోయాడు.

తరవాత మళ్ళీ ఉంగరం బూచాడిని పిలిచి కాసిని ఛాలా పకోడీలు తేరా అన్నాడు. హూష్ మాంకాళి అనేసరికి బోల్డు పకోడీలు వచ్చేశాయి.

వురేయి బూచాడూ, పకోడీలు తెచ్చానని మా బామకి చెప్పకేం, చెప్పితే నడ్డిమీద ఛంపేస్తాను జాగర్త అన్నాడు అలాడీను.

సరేండి చెప్పను అన్నాడు బూచివాడు.

మరి యిప్పుడేం చెయ్యాలిరా నేను అని అడిగాడు అలాడీను.

మరి యిప్పుడేమోనూ మరేమోనూ ముందస్తుగా షోడా తాగేసి అప్పుడేమో, రాజుగారి అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలండీ అని చెప్పాడు బూచివాడు.

హూం అన్నాడు అలాడీను, హూం అన్నాక, వురేయి బూచివాడూ దాని పేరేమిట్రా అన్నాడు.

సీ గాన పెసూనాంబండి అని చెప్పాడు బూచివాడు.

సరేని అలాడీను పరిగేరుకుని సీ గాన పెసునాంబా వాళ్లింటి కెళ్లిపోయాడు.

అక్కడ రాజుగారు కూచునాడు.

యావండీ మరీ యిప్పుడూ నేనేమోను మీ సీ గాన పెసూనాంబని పెళ్లి చేసుకోవాలండీ అని చెప్పేశాడు అలాడీను.

ఫోకిరీ వెధవకానా ఫోరా ఫో అనేశాడు వాళ్ళ నాన్న. వాడు రాజుగారు గదా.

అప్పుడు అలాడీను పరిగేరుకుని మళ్ళీ జెటకా దగ్గిరికి వచ్చేశాడు.

అప్పుడేమో వుంగరం బూచివాడిని మళ్ళీ పిల్చి యెలాగరా అన్నాడు. మరేమోండీ నాకు తెలీదండి ఈ అరికిను లాంతర్ని గోకండి అని చెప్పాడు ఉంగరం బూచాడు.

సరేని పాపం అలాడీను అరికిను లాంతర్ని యిలా గోకాడు. బేద్దభూతం వాడు వచ్చేశాడు ఇలా గారిగా పొడుగ్గా నవ్వేసి యేం కావాలి అన్నాడు.

అలాడీనుకి కుంచెం బయిం వేసింది. వురేయి మా బామ్మ వింటే మనిద్దరికీ ప్రెవేటు చెప్పేస్తుంది. కుంచెం మెల్లిగా నవ్వు. అసలు ముందస్తుగా యింత చిన్నవాడివి అయిపో. నాకే బయిం వేస్తుంటే అన్నాడు అలాడీను.

అప్పుడేమో తన ఖద చెప్పి ఎలాగరా అన్నాడు. భూతంవాడు మెల్లిగా పొట్టిగా ఇంత కుంచెం నవ్వి మీరు బెద్దవాడు అవాలండి లాపోతే పెళ్లి చెయ్యరు రాజుగారు అన్నాడు.

సరే నన్ను పెద్దవాడు చెయ్యరా అన్నాడు అలాడీను.

వుష్ మాంకాళీ అనేప్పటికి ఘుబుకుని బెద్దవాడైపోయాడు అలాడీను.

ఇప్పుడు మీ జేబునిండా ఫది కాణీ లుండాలండి. ఇంకానేమో నిఝుంజెటకా, ఓ పేద్ద మేడ కూడా ఉండాలండి అని చెప్పాడు బూతంవాడు.

అవన్నీ వచ్చేశాక, అలాడీనేమో రాజుగారింటికి మళ్ళీ వెళ్ళి రాజుగారి అమ్మాయిని పెళ్లి చేసుకోవాలీ అన్నాడు.




రాజుగారు హాచెర్యపడిపోయేసి మరి నీ దగ్గర యెన్ని డబ్బులు ఉన్నాయి అన్నారు.

నా దగ్గిర ఫ్ఫది కాణీలు ఉన్నాయి తెలుసా? అన్నాడు అలాడీను. అబ్బ, అన్ని కాణీలే అన్నాడు రాజుగారు.

ఇంకో నిజెం జెటకా కూడా ఉంది తెలుసా. కొరడా, బీడీలు, ఒక పేద్ద మేడా కూడా ఉన్నాయి అన్నాడు  అలాడీను.




రాజుగారు ఇంకా ఛాలా సేపు హాచెర్యపడిపోయేశారు.

అపుడు సరేని సీగాన పెసూనాంబకి పెళ్లి చేసేశారు. బోల్డు, బోల్డు బాజాలూ అవీ వచ్చాయి.

కాని ఏం చేశారంటే సీ గాన్న పెసూనాంబ ఒకర్తికే పెళ్లిచేశారు.

మరి నాకో· అన్నాడు అలాడీను పాపం.

నువ్వు బళ్ళోకి వెళ్ళవుగా. నీకు జెటకా వుందిగా అది తోలుకో ఫో అన్నాడు రాజుగారు.




యింక లాబంలేదూ బళ్ళో పడిపోవాలి అనుకున్నాను. మరినేను బళ్ళో పడిపోయి చదువుకోకపోతే రాజుగారేమో అలాడీనుకి పెళ్ళిచెయ్యనన్నారుగదా. అందుకని పరుగేరు కెళ్ళిపోయి అమ్మా నేను బళ్ళో పడిపోతాను నన్ను బళ్ళో పడెయ్యి నన్ను బళ్ళో పడెయ్యి అని చెప్పాను.

నువ్వు అల్లరి వాడివీ, నిన్ను బళ్ళో ఎవరు పడిపోనివ్వరుగదా ఎలా అంది అమ్మ.

నాన పట్టికెల్లి పడేస్తే పడనిస్తారుగా అని చెప్పాను నేను.

అయ్యబాబోయ్. బడిలో పడేస్తే మేష్టరు నాకు ప్రైవేటు చెప్పెయ్యడూ వద్దుబాబూ అన్నాడు నాన చాలా బయపడి పోయేసి.

మరి ఎలా, బాబాయిని తీసికెల్లి పడెయ్యమను అని మళ్లీ అడిగాను పాపం నేను.

బాబాయికూడా లాబంలేదు. బామ్మ తీసికెళ్తే పడెయ్యనిస్తారు అన్నాడు నాన. అప్పుడు బామ సరేనూ అంది, అంతట్లోకి లావుపాటి పక్కింటి పిన్నిగారొచ్చి మీ బుడుగుని బళ్ళో పడేస్తున్నారా నిజంగానే అంది.

నిజంగానేను అంది అమ్మ.

హమ్మయ్య అంది లావుపాటి పిన్నిగారు యిలా కళ్లు మూసుకుని.




అలా అంటే ఏమిటో నాకు తెలీదు.

ఏమిటే అని అడిగితే నాకూ తెలీదు నాన్నా అంది లావుపాటి పిన్నిగారు.

సరేని భామ్మ నన్ను బళ్లో పడెయ్యడానికి తీసుకెళ్తానంది.

ఇలా కుంచెంకూడా మేం నడిచి వెళ్లామోలేదో కాని అంతల్లోకే బడి మేష్టరు పరిగేరు కొచ్చేశాడు.

బామ్మగారూ బామ్మగారూ మరేమోను మాబడి మూసేశాం. సెలవులిచ్చేశాం. అదండీ సంగతి అన్నాడు.....అని హమ్మయ్య అన్నాడు.

బామ్మేమో హయ్యో ఎలాగరా మరి బుడుగూ బడి లేదుట ఇంక అంది.

పోనీ రేపు పడెయ్యి బడిలో అన్నాను నేను.

రేపుకూడా బడిలేదు. ఎల్లుండికూడా బడిలేదు. ఇంకా డబ్బైపది ఇరవయి ఏబై తొంబై మూడు రోజులుధాకా బడిలేదు. వేసం కాలం వచ్చేసిందిగా అందుకని సెలవు లిచ్చేశాను బడికి అని చెప్పేశాడు మేష్టరు గబగబా.

యింకా చాలా వేసంకాలం రాలేదుగా అంది బామ్మ.

బోల్డు వచ్చిందండి అన్నాడు మేష్టరు.

దండి అంటే ఏమిటిరా అన్నాను.

దండి అంటే నీ తలకాయండి అన్నాడు మేష్టరు కోపంగా.

యండి అంటేనో అన్నాను నేను.

నిన్ను నడ్డిమీద ఛంపేస్తాననండి అని మేష్టరు యిలా కోపంగా ముందరికి వచ్చేశాడు.

ననండి అంటేకూడా నాకు తెలీదుకాని బయం వేసింది. హడ్డిలిపోయి యింక లాబంలేదురా అని, యిలా కాలు పెటేశాగదా అడ్డంగా. బాబాయి నేర్పాడులే అది.

యేం. అంతే వాడు గబుకుని యిలా వంగిపోయి పరిగేరుకెళ్ళిపోయి ఆగి మళ్ళీ వెనక్కి వచ్చాడు.

వచ్చి హు అన్నాడు. హూం అన్నాకానేమో, అందికే నేను బడి మూసేశాను అల్లరివెదవాని అన్నాడు. అంతట్లోకి లావుపాటి పక్కింటి పిన్నిగారు పరిగేరుకొచ్చేసింది.

హో, బడిలేదంటావా, ఎందుకు లేదు. ఇంకా ఫదిరోజులు ఉంది. వీణ్ణి బళ్ళో పడేసుకో ఇప్పుడు అంది కోపంగా.

బడి ఇంత అస్సలు కుంచెంకూడా లేదండి అన్నాడు మేష్టరు.

బడి ఇంకా చాలా బోల్డువుంది. అపుడే వేసంకాలం రాలేదు అంది లావుపాటి పిన్నిగారు. మేష్టరుకి బయం వేసింది.

యెలాగా. ముందుచూస్తే పిన్నిగారూ వెనకచూస్తే బుడుగూను అన్నాడు.

యేం, అప్పుడేమో మా అమ్మ వీది అరుగుమీదికి వచ్చి ఏమండీ మేష్టరూ మా బుడుగు యింక అల్లరి చెయ్యడండీ, వాణ్ణి బళ్ళోకి రానియ్యండి అంది.

ండీ అంటే యేమిటో నాకు తెలీదు. అందరూ అలా ండీ ండీ ండీ అంటారు గాని.

యేం అపుడేమో మేష్టరు యిలా నవ్వేసి సరేండి, వీడిని కుంచెం చాలా అల్లరి మానెయ్యనీండి, అపుడు బడి తీశాక వేసుకుంటాండీ అన్నాడు.

ఇంకేం చేస్తాం. మనం అల్లరి మానేసేదాకా బడి తియ్యరుట. అందుకని బడితీసేదాకా అల్లరి మానెయ్యాలన్న మాట.

అదీ సంగతి. అలాని బాబాయి చెప్పాడులే.




వ్రేయ్! ఆగరా కుంచెం. ఎవడ్రా నువ్వు. నన్నెక్కడో చూసినట్టున్నావే. ఎందుకలా హాచ్చెరపడిపోతావు! – లాపోతే బయపడిపోతావు? –

బయమంటే నాకు తెలీదులే హాచ్చెరం అంటే కూడా తెలీదనుకో. బాబాయి చెప్పాడు.

చిన్న పిల్లలు ఉత్తినే కిందపడి పోతారట కాని పెద్దాళ్లు మాత్తరం ఉత్తినే పడరు. ఎప్పుడూ హాచెరపడి పోతారు. లాపోతే బయపడి పోతారుట. లాపోతే విచారపడి పోతారుట.

అలాంటేకూడా మనికి తెలీదనుకో. మనికి తెలీపోయినా మాటాడచ్చు. ఇలాని బాబాయి చెప్పాడులే.

ఇప్పుడు రెండు జెళ్ళ సీతలుంటాయా, – ఒక్క జెళ్ల సీతలేనా సరే. బాబాయికి అస్సలు తెలీవు గదా. అయినా యిలా చూసి నవ్వేస్తాడు బాబాయి.

నన్ను కొంచెం ఈలవేసి పెట్టమనికూడా అంటాడు. నేను మంచివాణ్ణి గదా పాపం. నాకు జాలి ఉందిట. ఇలాని బామ్మ అంటుందిలే.

అందుకని ఈలవేసి పెట్టుతానా. రెండుజెళ్ళ సీతలూ ఒక్క జెళ్ళ సీతలూ నన్ను చూసి యిలా నవ్వితే అప్పుడేమో బాబాయి హాచ్చెరపడిపోతాడు.




ఇలా కోపంగా చూసి హన్నా అని గాఠిగా ప్రెవేటు చెప్పేస్తే బాబాయి బయపడి పోతాడు.

అస్సలు ఏమీ అనకుండా పోయారనుకో అప్పుడేమో యిలా విచారపడి పోతాడు బాబాయి.

మన్ని ఎత్తుకొని ఉంటే మన్ని కూడా పడేస్తాడు.

అందుకనే రోడ్డుమీద సీతలు నడుస్తున్నపుడు బాబాయి మనని ఎత్తుకుంటానన్నా సరే మనం ఒద్దనాలి తెలిసిందా.

మనం అంటే నువ్వు కాదులే. నువ్వు బెద్దవాడివిగదా. లావుగా వున్నావు. అందుకని బాబాయి నిన్ను ఎత్తుకోలేడు ఎత్తుకుంటే కాలిమీద పడేసుకుంటాడు గదా. కాలు నలిగిపోయి యేడుస్తాడు.

ఏడిస్తే బామ్మ రూపాయిస్తుంది. సినిమా కెళ్లొచ్చు. మనక్కాదులే. నేను ఏడిస్తే జీళ్ళు ముక్క పెట్టుతుంది. లాపోతే కాణీ యిస్తుంది. బాబాయేడిస్తే రూపాయిస్తుంది.

లావుపాటి పక్కింటి పిన్నిగారు ఉందా. వాళ్ళమగుడు దానికి ప్రైవేటు చెప్పేస్తాడా. అప్పుడేమో అది యిలా యేడుస్తూ బామ్మ దగ్గిరికి వస్తుందా.

బామ్మేమో యేడవకమ్మా అని దానికి అవిడికి కాఫీ యిస్తుంది. అప్పుడేమో వాళ్ళ ముగుణ్ణి పిలిచి ప్రైవేటు చెప్పేస్తుంది. తరవాతేమో ఇంకుంచెం కాఫీ ఉంటే కుంచెం నీళ్ళుపోసి యిస్తుంది వాడికి.

లావుపాటి పక్కింటి పిన్నిగారు ముందస్తుగా వచ్చేసి ఏడిచి బోల్డు ఖాఫీ తాగేస్తుంది గదా. అందుకు.

తాగేసి ముక్కు చీదుకుని వెళ్ళిపోతుంది గదా.

అప్పుడేమో నాన్నా లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడూ ఇంగ్లీషులో మాట్లాడుకుంటారు. నవ్వుతారు. ఇందాకా ఏడుస్తాడు గాని ఇప్పుడు నవ్వుతాడు తెలుసా?

అసలు వాళ్ళింట్లో కాఫీ పొడుం అయిపోతే లావుపాటి పక్కింటి పిన్నిగారు ముందస్తుగా బామ్మ దగ్గరికి ఏడుస్తూ వచ్చి కాఫీ తాగేస్తుందిట. అపుడేమో వాళ్ళ ముగుడు కూడా వచ్చి కొంచెం కాఫీ తాగుతాడట.

తరవాత నాన్నతో – అంటే గోపాలంతే. ఇంగ్లీషు మాట్లాడి ఫది సిగరొత్తులు కాల్చి వెళ్లిపోతాట్ట. ఇలాని బాబాయి చెప్పాడులే.




అందికనే రేపో నిన్నో వాళ్లు మనింటి కొస్తే నేను అడిగాను గదా. ఏవండీ పాపం మీ యింటో కాఫీపొడుం అయిపోయిందా అందుకే ఏడుస్తూ వచ్చారా అని.

అప్పుడేమో అమ్మ, బామ్మ, నాన్నా అంధరూ గా గా హా అని అరిచేశారు. నామాట లావుపాటి పక్కింటి పిన్నిగారికి వినబడనే లేదు.

తరువాతేమో నాన్న అల్లరి వెధవకానా రవుడీ అలానేసి తిట్టాడు – వాడి క్కోపం రాలేదులే. దొంగ. ఇలా కోపంగా చూసి తిట్టుతాడా, కుంచెం నవ్వుతాడు కూడా.

రాదేనా అంతే. రాదంటే అమ్మలే. కుంచెం కోపంగా చూసి కుంచెం నవ్వుతుంది.

అసలీ పెద్దవాళ్ళతో ఇదే చిక్కు. వీళ్ళతో వేగడం చాలా కష్టంఅనుకో. కష్టం అంటే ఏవిటో నాకూ తెలీదు. అప్పుడప్పుడు అలా అనమని బాబాయి చెప్పాడు.

ఇప్పుడు నాతో వేగలేమంటే, నేను మూడ్రోలో, ఫది నెల్లో అల్లరి ఛాలా మానేశానుగదా.

చిక్కుడుపాదు మీద గొంగళిపురుగులు మూడు కూడా తీసుకెళ్ళి లావుపాటి పక్కింటి పిన్నిగారి మీద పడెయ్యలేదు కదా.

వాళ్ళ ముగుడు, వాళ్ళ ఆఫీసులో విగ్గులేని ఎముడితో – ఇలాంటే మేనేజరులే – మాట్లాడుతున్నపుడు భోయ్‌మని అరిచి భయపెట్టటం లేదుగదా.

బాబాయి రూపాయో, ప్వదణాలో ఇచ్చినా రెండు జెళ్ళ సీతళ్ళి, ఎదురింటి సుబ్బలష్మి ముక్కుని చూసి ఈల వెయటం లేదుగదా. ఏయ్ పిల్లా అనటం లేదుగదా.

మా గోపాళం ఆఫీసు కాయితాలమీద చాలా బొమ్మలు వెయ్యటం లేదు గదా.

రోజా ఫదిసార్లు కూడా బామ్మ పిలిచిందని చెప్పి జెటకాలు పిల్చుకురావటం లేదుగదా.

ఒక్కణ్ణే ఏడుసార్లు కూడా జెటకా తోల్టం లేదుగదా.

బామ్మ వత్తుల పెట్లో ఫది బీడీలు కూడా దాచటం లేదుగదా.

మరి నేను రేపు బెద్దవాణ్ణయాక రైలింజను తోలుతానుగా. అందుకు దాచుకోటమే లేదు.

మనం అల్లరిచేస్తే ఒద్దురా అని తిట్టుతారు. సరే పోనీ పాపం అని జాలిపడి ఇప్పుడు మూడ్రోలో ఫదినెల్లో అల్లరి మానేశానా నాన్న హడ్డిలి పోయాడు. బయపడిపోయాడు.

వాడు అస్సలు అల్లరి చెయ్యటంలేదే రాధా, ఒంటో బావులేదా అంటున్నాడు అమ్మతో.

దిష్టి తగిలిందేమోనండీ అంది అమ్మ.

దిష్టంటే నాకు తెలీదు. ఒంటో బావులేదనడం అంటే జెరం రావడంట.

నాన్న ఆఫీసులో విగ్గులేని ఎముడితో యుద్దం చేస్తాడనుకో. అప్పుడు నాన్నకి ఒంటో బావుండలేదనడం వస్తుంది.

సుబ్బలష్మి సంకురాంతిరి ముగ్గేసినపుడు బాబాయి ముగ్గు చూసి నీ ముక్కు బావుందీ అంటాడనుకో అరుగుమీద నుంచుని.

అప్పుడేమో బామ్మేనా, సుబ్బలష్మి నాన్నేనా విని హాయ్ ఫోకిరీ అంటారు గదా.

అపుడు బాబాయికి ఒంట్లో బావుండలేదనడం వచ్చేస్తుంది.

సీ గానపెసూనాంబ నా జట్టు లేకపోతే నాక్కూడా కుంచెం వస్తుందనుకో.

యేం, అదీ సంగతి, అల్లరిచేస్తే ఒద్దురా అంటారు. చెయ్యకపోతే మనం లేకుండా రాదతో చెప్తారు.

అసలు మనం అల్లరి చేస్తేనే వాళ్ళకి చాలా యిష్టం అని నాకు అవమానం.




ఎందుకంటే! వాళ్ళ బాబిగాడి అమ్మొస్తుందా. అబ్బా మావాడి అల్లరి ఎక్కువండీ అంటుందా. అమ్మేమో హయ్యో మా బుడుగు అల్లరి చూళ్ళేదు మీరు అంటుంది.

అంతెందుకు ఓ సారి చుట్టాలొచ్చారుగదా బోల్డుమంది. బామ్మా రాదా అందరూ నేను బాగా అల్లరి చేస్తానని చెప్పేశారు.

వాళ్ళ ముగుడేమో ఏదమ్మా బుడుగూ కుంచెం అల్లరి చెయ్యి చూదాం అన్నాడు.

అందరూ నా చుట్టూరా కూచుని అల్లరి చెయ్యీ అల్లరి చెయ్యీ అని ఒకటే అల్లరి చేసారులే. ఎలా చెప్పు. ఎంత గొప్ప అల్లరివాడికేనా కష్టంగదా. సిగ్గేస్తుందిగదా. సిగ్గంటే నాకు తెలీదనుకో. కాని వేస్తుందిట.

నేను మూడ్రోలూ పదినెల్లూ అల్లరి ఛాలా మానేశానుగదా!



అప్పుడు నాకు ఛాలా బోల్డు సిగ్గేసింది. నేను చెయ్యను ఫో అన్నాను. నాన్నకి ఖోపం వచ్చేసింది. చెప్పినట్టు విని అల్లరి చెయ్యి అని గారిగా అరిచాడు.

నేను చెయ్యనుఫో అన్నాను.

చిన్నపిల్లలు అని జాలికూడా లేదుగదా.

ఉట్టి అల్లరి వెధవమ్మా చెప్పినమాట విండూ అంది బామ్మ.

అంతలోకీ ఫది బండివాళ్లు బోల్డు పెట్టెలు పరుపులు తెచ్చిపెట్టేశారు. బోల్డు లావుపాటి చుట్టాల పిన్నిగారులూ, మూడు వాళ్ళ ముగుళ్ళూ, రెండు రెండు జెళ్ళ సీతలూ, వాళ్ళకేసి చూసి నవ్వుతూన్న మూడు బాబాయిలూ, రెండు బామ్మలూ, ఐదు సీ గానపెసూనాంబలూ, ఒక బుడుగూ లోపలికి వచ్చేశాయి.

సుబ్బులూ అన్నాయి బామ్మలు. సూరమ్మ బామ్మా అన్నాయి గుండున్న పిన్నిగారి ముగుళ్లు. గుండు ముగుళ్ళదిలే.

బామ్మ, రాదా, గోపాలం, చుట్టాలూ అందరూ హడ్డిలిపోయారు.

సుబ్బులెవరు? సూరమ్మెవరు, బామ్మెవరు, పిన్నెవరు అన్నాడు గోపాళం హాచరపడిపోయేసి.

ఎవరండీ మీరు అంది బామ్మ.

ఇది సుబ్బారాయుడిగారి ఇల్లు కాదాండీ అన్నాయి చుట్టాల బామ్మలు.

అబ్బే. అది పక్క వీధిలోనండి. కొత్తగా దిగారు వాళ్ళేనా? అంది అమ్మ.

అవునండీ. ఈ యిల్లేనని చెప్పారే అన్నాయి చుట్టాల బామ్మలు.

ఎవరో తప్పు చెప్పారు అన్నాడు నాన్న.

ఎవరేమిటి అదిగో ఆ పిల్లాడే. ఇందాకా వీధిచివర కొట్టుదగ్గిర కనపడి మా యిల్లే రండి రండి అని చెప్పి పరిగేరుకొచ్చేశాడు మీ యింటోకి. సరేగదాని మేం ఇక్కడికొచ్చి సామాన్దింపించేశాం అన్నాయి బామ్మలు.

అవును ఆ పిల్లాడే అన్నాయి సీతలూ, బాబాయిలూ, బుడుగులూ, గాన పెసూనాంబలూను.

అప్పుడేమో –

అంధరూ నాకేసి చూశారు. బలే బయం వేసిందనుకో. కాని పాపం అంతలోకే నవ్వేశారు హ హ హ హ అని.

హోరి భడవా అంది బామ్మ, అమ్మకూడా గారిగా నవ్వేసి ముద్దుపెట్టేసుకుంది.

నేను అల్లరిచేస్తే అమ్మ అస్తమానూ నవ్వదుగదా. నేను అలా వెళ్లి దాంకున్నాక నవ్వుతుంది.

నవ్వితే అమ్మ ఎంతో బావుంటుంది. నాన్న కన్నా, బాబాయికన్నా, సీత కన్నా, సీగానపెసూనాంబకన్నా, లావుపాటి పక్కింటి పిన్నిగారికన్నా, నాకన్నా బావుంటుంది.

యేం. అప్పుడు బామ్మ లేచి బోల్డు యింత పెద్ద డేగిసా నిండా కాఫీచేసి అంధరికీ పంచి పెట్టింది.

డబ్బులు వాడి దగ్గిర పుచ్చుకో అన్నాడు నాన్న.

అవును రేపు బోఘి పండక్కి డబ్బు సంపాదిస్తాడుగా అంది అమ్మ.

సంపాదించడం అంటే మనకి తెలీదు. కాని బోఘి పండక్కి దంబిడీలూ. కాణీలూ ఏరి దాచుకోడం సంపాదించడం అని నాన్న చెప్పాడు. బామ్మకి అమ్మకి ముద్దిచ్చి కాణీ తీసుకోడంకూడా సంపాదించడమేనుట.

దీచిలో సీతలకేసి చూసి బాబాయిలకి ఈలవేసిపెట్టి ఏయ్ పిల్లా అని పిలిచిపెట్టి బాబాయి లందరి దగ్గర ఫదణాలు తీసుకోడం కూడా సంపాదించడమేనట.

కాని పండగే బెస్టు. పిల్లలకి డబ్బులొస్తాయి.




పండగంటే – అవి చాలా రకాలు. బాబాయికి సీత కనిపిస్తే ఓపండగట. నవ్వితే రెండు పండగలు. ఆఫీసులో విగ్గులేని ఎముడు ఊరెళ్తే నాన్నకి పండగ.

లావుపాటి పక్కింటి పిన్నిగారు కాసేపు సినిమా కెళ్తే వాళ్ళ ముగుడికి పండగట. ఇలాని నాన్న చెప్పాడులే. అప్పుడు అమ్మకి కోపం వచ్చింది కూడాను.

కాని అన్నిటిలోకి బోఫిపండగే బెష్టనుకో. అయినా ఈ కాలంలో బాగుండడంలేదుట. బోఫిపళ్ళలో కల్తీ ఎక్కువ అయిపోయిందని మొన్న బాబిగాడు అన్నాడు.

కల్తీ అంటే పాలలో నీళ్లు కలపడంట. లాపోతే నాన్న ఆలీసెంగా వచ్చి అమ్మకి కొంచెం అబద్ధం చెప్పడంట.

ఇప్పుడు రేగిపళ్లు దంబిడీలు కలిపితే బోఫిపళ్ళే గదా. కాని ఇపుడు దంబిడీలకన్న రేగిపళ్ళే ఎక్కువ కలిపేస్తున్నారుట.

దంబిడీలూ, కాణీలూ అయిపోయాయి గదా. ఇపుడు నయాపైసాలు. ఇవి చాలా ఖరీదని నాన్న చెప్పాడులే.

అందుకని బోల్డు రేగిపళ్లు ఒకటో మూడో నయాపైసాలూ వేస్తున్నారు.

ఇలా చేస్తే చిన్న పిల్లలు పాపం డబ్బు ఎలా సంపాదిస్తారు? అందుకని ఈ పండక్కి ఎక్కువ నయాపైసాలు వేసి కుంచెం రేగిపళ్లు వెయ్యాలి అందరూ.

## మేష్టర్లతో వేగడం

అబ్బబ్బ! ఈ మేష్టర్లని ఉంటాయే, వాటితో వేగలేక పోతున్నానురా. చాలా కుంచెం కష్టమన్న మాట.

వేగలేక పోతున్నడం అంటే – ఓసారేమో అమ్మ సినిమా కెళ్ళిందని, బామ్మ గుళ్ళోకెళ్ళింది గదా. అప్పుడు మా గోపాళం – వంట చేశాడు గదా.

అప్పుడేమో కంద ముక్కలూ, వంకాయలూ కలిపి వేయించాడా, పాపం వంకాయేమో చప్పున వేగిపోయింది. కంద వేగలేదుట.

అందుకనేమో, వంకాయేమో – అబ్బ, కందా కందా, నీతో నేను వేగలేక చస్తున్నాను అందిట.

వీడు చూడు
నన్నెలా
వేపుకు తినేస్తున్నాడో!

అప్పుడేమో కంద మా నాన్నకేసి చూసి – కాదులే, వీడు చూడు – నన్నూరికే వేపుకు తినేస్తున్నాడు అందిట.



ఇలాని నాన్న చెప్పాడు. నాన్నేం చెప్పినా, మళ్ళి అవి మనం చెప్తే ఆయాసం వస్తుంది...... నవ్వుకూడా రాదు.

కాని నాన్నేం చెప్పినా అమ్మకి నవ్వొస్తుంది. మనం చూడనప్పుడు ఉత్తినే నాన్నని చూసినా, అమ్మకి నవ్వొస్తుంది. అమ్మ పాపం మంచిదనుకో.

యేం......ఇప్పుడీ మేష్టర్లు అలాగన్నమాట. మేష్టర్లు రొండురకాలు గదా!

ఒకటి మామూలు మేష్టర్లు. ఐదు ప్రైవేటు మేష్టర్లు. ప్రైవేటు మేష్టర్లే కుంచెం మంచివి.

మనకి అపుడపుడు నెత్తిమీద. వీపుమీద ప్రైవేటు చెప్పినా, మనం గారిగా ఏడిస్తే బామ్మొచ్చి తిడుతుంది గదా!

అందికని మనమంటే కుంఛెం చాలా బయ బత్తులుట......బయ బత్తులంటే నాకు తెలీదు. అలాని బామ్మంటుంది.

భవుశా అగరొత్తులో, బాబాయి కాల్చే సిగరొత్తులో అయుండవచ్చని నాక్కుంఛెం అవమానం.

యేం సాధార్నంగా ఈ మేష్టర్లకి ఏం తెలీదు పాపం. పెద్దాళ్ళనడిగితే కోంబడతారని బయం.

అందికని బడి అని ఓటి పెట్టి మన్ని అడుగుతారన్నమాట. మనం అక్కడ పాపం చెప్తామా.

వాళ్ళకి పాఠాలు రావుగదా. అప్పుడేమో ప్రైవేటు మేష్టరు వేషం వేసుకుని మనింటికొచ్చి 'వురేయ్ బుడుగూ, బుడుగూ, రెండూ రెండూ ఎంత?' అని అడుగుతారు.

ఇంకానేమో 'సిరాముని దైచేతను పజ్జెం చెప్పమ్మా!' అని యిలా ఏడుస్తూ అడుగుతారు.

ఇక్కడ నేర్చుకున్నా, మర్చిపోయి మళ్ళీ బళ్ళో అడుగుతారు. పాపం మనం చెపామా. వినరు.




రెండు రెళ్లు పద్నాలుగు కాదు. నువ్వు అబద్దం చెప్తున్నావూ, నిజెం చెప్పమ్మా, అంటారు.

పోనీగదాని మనం ఏడు అంటామా......అదీ నిజెం కాదంటారు.

మొన్నో రేపో దీపావళి అంటే ఏంట్రా? అని ఒక ప్రైవేటు మేష్టరు అడిగాడా.....వీడు బాగా పాతవాడులే.

నా దగ్గర చిన్నప్పుడు పనిచేశాడు. చాలా ఐదు రోలయుంటుంది. నిన్న కొత్త వాడొచ్చాడా వీడూ అడిగాడు.



పాతవాడికి చెప్పానురా. వెళ్ళి వాడినడుగు లేపోతే మీ నాన్ననో, బాబాయినో అడుగు అన్నాను.

మా బాబాయిని మాతరం అడగొద్దు. ఎవరేనా రెండు జెడల సీతలు అడిగితేనే వాడు చెప్పుతాడూ – సీతలు అడిగితే పదమూడో ఎక్కం కూడా చెప్పుతాడూ అని చెప్పాను.

కాదమ్మా బుడుగూ, నువ్వే చెప్పమ్మా అని ఏడిచాడు మేష్టరు.

మా బామ్మ నడిగి బెల్లమ్ముక్క పెడతానూ ఏడవకమ్మా అన్నాను.

లేకపోతే మా బామ్మ వత్తులపెట్లో కాణీయో, ఫదణాలో ఉంది తీసుకో అన్నాను.

కాదమ్మా చెప్పాలి. బళ్ళో నిన్న చెప్పానుగా. అదేచెప్పు అన్నాడు.

చూశావా, పచ్చి నిజెంకాదది. బళ్ళోకూడా వాడే నన్నడిగాడు.

నేను పోనీగదాని చెప్తే, చీ రౌడీవెదవా అని తిట్టి నెత్తిమీద ప్రెవేటు చెప్పాడు.

తరవాత వాడేమిటో చెప్పాడు. మళ్ళీ ఇక్కడికొచ్చి మళ్ళీ అడిగాడు.

పోనీగదాని మళ్ళీ చెప్తే, మళ్ళీ ప్రెవేటు చెప్పాడు. అప్పుడేవోఁ నేను గాఠిగా ఏడిచేశా.

బామ్మొచ్చి ప్రెవేటువాడికి గారిగా ప్రెవేటు చెప్పేసింది. అపుడేమో పాపం బాబాయొచ్చి, అన్న బామ్మ అని బామ్మకి ప్రెవేటు చెప్పాడు.

నాన్నొచ్చి వెదవకానా అమ్మని (దీన్నే కొందరు బామ్మంటారులే) కోంబడతావా అని బాబాయికి గారిగా ప్రెవేటు చెప్పాడు.

అపుడు బామ్మేమో 'అన్నా, కుర్రవెదవ, వాణ్ణెందుకు తిడతావురా' అని నాన్నకి ప్రెవేటు చెప్పింది.

అపుడేమో అమ్మొచ్చి 'ఉరేయ్ గోపాళం, నువ్విలా రండి' అని గదిలోకి వచ్చి నాన్నకి ప్రెవేటు చెప్పింది.




పాపం ప్రెవేటు మేష్టరు హడ్డిలిపోయి పారిపోయాడు.

అపుడేమో. లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడు యిలా నవ్వుతూ వచ్చి 'ఏరా బుడుగూ, మీ యింట్లో యివాళే దీపావళా?' అన్నాడు.

అదన్నమాట. దీపావళంటే పేలవటం. అందరూ గారిగా ప్రెవేట్లు చెప్పేసుకుంటే దీపావళి అంటారుట.

ఇలాని బాబాయికూడా చెప్పాడనుకో.

కాని ఇలా అయితే మా యింట్లోనూ, లావుపాటి పక్కింటి పిన్నిగారింట్లోనూ, మీ యింట్లోనూ, సినిమాల్లోనూ పేపరులోనూ (ఇవన్నీ బాబాయి చెప్పాడులే) రోజూ దీపావళి పండుగే అవుతుంది. గదా.

అందుకని శ్రీక్రిష్ణుడు ఇంకో దీపావళి పెట్టాలి. పాపం వాడికి వెయ్యి డెబ్బయ్యి పది యిళ్ళున్నాయటగా.




ఎక్కడి కెళ్ళినా రోజా ప్రెవేటే. అంంంంధరికన్నా సత్యభామ గారిగా ప్రెవేటు చెప్పేది గదా.

అందుకని ఏడాది కోసారేనా ఇంట్లో దీపావళి పండుగ ఆపేసి – । చప్పుడులు వినబడకుండా ఇంంంంఖా గాఆఆరిగా చప్పుడుచేసే టపాకాయలు పేల్చాలనీ, అదే అసలు దీపావళి అని కిష్టుడు చెప్పాడన్నమాట.



బాబాయింకేదో ·పిచ్చికద చెప్తాడనుకో. అదికాదూ, ఆరోజున రెండు జెళ్ళల సీతలన్నీ గుమ్మంలో కొచ్చి టపాకాయలు కాలుస్తాయి. ఇంచక్కా నవ్వుతాయి – మనం వాళ్ళని చూస్తూ రోడ్డుమీద వెళ్ళచ్చు – అప్పుడేమో రెండు జెళ్ళ సీతలన్నీ దీపాలలా వెలుగుతాయీ – అందుకని దీపావళీ – హమ్మయ్య – అని చెప్పాడు బాబాయి.

బాబాయి మొహం, వాడు ఏ పండుగ అడిగినా ఇలాగే చెపాడు.

అట్లతద్దికీ సీతలే – దసరాకీ సీతలే – సంకురాతిరికీ సీతలే – బోగిమంటలకీ సీతలే – అన్నింటికీ సీతలే వాడికి.

అంతెందుకూ, మొన్న దేవుడిగుళ్ళో కెళ్తున్నానా......నేనూ వస్తారా అని ఏడిస్తే బాబాయిని తీసికెళ్ళానా.... ఎవరో వచ్చి, నువ్వెందుకురోయ్ అంటే – రెండుజెళ్ళ సీత వుంటుందిగదా అన్నాడు.

నేను హాచెర పడిపోయి పిచ్చి బాబాయి. గుళ్లో దేవుడుంటాడురా రెండు జెళ్ళ సీతలు కావురా పిచ్చాడా అని చెప్పానా....వాడు మళ్ళీ గారిగా నవ్వేసి పిచ్చి వెధవా......నా కళ్ళు పెట్టుకు చూడరా, నీకు గుళ్ళోనూ, రాయిలోనూ, రప్పలోనూ, అన్నింటిలోనూ, రెండుజెళ్ళసీతలే కనిపిస్తాయి అన్నాడు.

నేను వాడి కళ్ళజోడు పెట్టుకు చూశాను. సీతా లేదు, సీతా లేదు. ఆస్సలేమీ కనిపించలేదు.




మేష్టరు మనికి గుండుమీద గాఠిగా ప్రెవేటు చెప్పినపుడు ఏంకనిపిస్తుందీ? అలా వుందన్నమాట.

ఏం చేస్తాం, బాబాయి కర్మ......అసలు వాడెప్పుడూ ఇంతే.

నిన్నో రేపో మా గోపాళం వాడి మార్కులు చూసి ఏరా నువ్వు కాలేజికెందుకు కెళ్తున్నట్టు? అన్నాడా.....

రెండుజెళ్ళసీతల్ని చూడ్డానికి అనేసి ఇలా నాలిక్కరుచుకు ఏడిశాడు.

పోకిరీ వెదవా అన్నాడు నాన్న. అలా అంటే నాకు తెలీదులే

యేం.....దీపావళి గురించి కదూ. పాపం నీకు చెప్పతానన్నాను. ఏవిఁటో నాకు వైసైనకొద్దీ మతిమరపు వెక్కువయిపోతోందమ్మా – ఇలాని బామ్మంటుందిలే




బామ్మకుక్కూడా వైసెక్కువయి పోతోందిట. అప్పడప్పుడు నాన్న కూడా వయసెక్కువయి పోతోంది. నా కళ్ళజోడు ఎక్కడ పెట్టానర్రా అంటాడు, నెత్తిమీద ఉందని మర్చిపోయి.

దీపావళి కేవిఁటంటే – టపాకాయలు బాగా కాల్చాలి. మరేమో అవి బాగా వినాలంటే ముందస్తుగా రేడియో మూసెయ్యాలన్నమాట.

మందేకాదు. అద్దం విరిగిపోయిన లావుపాటి పక్కింటి పిన్నిగారి రేడియో కూడా మూసెయ్యాలి.



కరెంటు పోయిందండీ అని చెప్పాలన్నమాట లేకపోతే లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడు మళ్లీ పెట్టేస్తాడు.

రెండు: మన్ని పొద్దున్నే కాల్చనివ్వరనుకో. రేడియో దీపావళి అయితే కానీ, ఒద్దని నాన్నా వాళ్ళు అంటారుగదా.

అపుడేమో కాళీడబ్బాలు తెచ్చి – ముందుగానే చూరుకి బాబాయిచేత వేళ్ళాడగట్టమని – తరవాత రాళ్ళు అందులో వెయ్యాలి....... ఆడవాళ్ళ వంటలు ఇలాగే చేస్తారుట.

మా అమ్మ కాదనుకో. అమ్మ బాగా చేస్తుంది.......అలాంటే బామ్మ కోపం.

మనికి కాణీయో, ఫదణాలో ఇవ్వదు జాగర్త.

......యేం.......? ఒక్కో సారి ముందుగానే రాళ్ళు తెచ్చి పడేసేసి, డబ్బాలు కట్టలేదనుకో, అవి కాళ్ళ మీద పడతాయి. జాగర్త.




యేం......? ఆ డబ్బాలో రాళ్ళేసి కర్రలతో కొట్టి కాసేపు వూపితే అప్పుడు నాన్నా, బాబాయి అందరూ వచ్చేసి, రేడియో ఆర్పేసి మనకి పెట్లో టపాకాయ లిస్తారు.

డెబ్బై: నీకు నాన్న మీద, బాబాయిమీద కోపం వుందిగదా – అలాంటప్పుడు సీమ టపాకాయల గుత్తి అంటించి గారిగా తిట్టెయ్యి. నిన్నేం చెయ్యరు. లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడికిది చెప్పాను. వాడు ఏడాదేడాదీ ఇలాగే చేస్తాడు.




ఫది: బాబాయి గాళ్ళకి ఒకటి చెప్పాలి. మతాబాలు కాలుస్తూ రెండు జెళ్ళ సీతల్ని చూడకేం!....అని ఒకటి కాదు పది రెండు జెళ్ళ సీతల్ని కూడా చూడకూడదు. చిచ్చుబుడ్డి కాలుస్తున్నా సరే.

నాలుగు: రెండు జెళ్ళ సీతల్ని చూస్తూ మతాబా కాల్చకు.

మతాబా లైటులో సీతలు బాగా కనబడతాయిగాని – వెధవా...... కుర్ర వెధవ్వి, నీ కెందుకురా ఇలాటి ఆడపిల్లల విషయాలు...... ఫో..... చదివేస్తున్నాడు పాపం.......

బామ్మలు తాటాకు టపాకాయలు చాలా కొనమంటారు. వీటిని పేలకపోయినా రేపు కడిగి నాలిక గీస్కోడానికి వాడవచ్చును.

బాబాయి: ఫో అమ్మా – తాటాకు టపాకాయలు ఒక్కోటి కాణీ – కాణీ తాటాకుపెట్టి నాలిగ్గీసుకుంటావా?

నాన్న: పోరా వెధవా.....నీ బియే సర్టిఫికేట్టు (ఇలాంటే నాకు తెలీదు)కన్న నయమే. బోల్డు రూపాయలు పెట్టాం. ఇప్పుడది నాలిగ్గీసుకుందిగ్గూడా పనికిరాదు.

ఏవిఁటో పెద్దాళ్ళమాటల్లో అర్ధంపర్ధం ఉండదు. (ఇలాంటే నాకు అర్ధం తెలీదనుకో)

కానీ మనం రేపో ఫదిరోజులకో టపాకాయలన్నీ అయిపోయాక – అట్టపెట్టెలూ. తడిసిపోయిన సీమ టపాకాయలూ కాలుస్తామా....అపుడొచ్చి గారిగా మనికి ప్రైవేటు చెప్తారు.

అదింకో దీపావళి –

అన్నట్టు ఈ యేడాది రెండు దీపావళీలున్నాయి తెలుసా....పాపం, మా ప్రైవేటు మాష్టారు ఏడిచాడు కూడాను – ఒక్క దీపావళీ కే ఏడుస్తున్నాను. రెండు దీపావళీల కేం చెయ్యనూ? అని.

మళ్ళీ ఏడవండి.......మీ స్కూలువాళ్లు జీతాలు సరిగ్గా ఇచ్చేదాకా అంతే నన్నాడు బాబాయి. ఇలాంటే ఏవిఁ టో మనకి తెలీదనుకో.......ఈ జీతాలు గురించి అస్సలు తెలీదు.

జీతాలు ఇచ్చినందుకు కొందరేడుస్తారుట. ఇవ్వనందుకు కొందరేడుస్తారుట. ఇలాని నాన్న చెప్పాడు. కాని రెండు దీపావళులు వస్తే మాత్తరం ఏడవకూడదుట.

ఎందుకంటే చైనాలో, పాకిస్తాన్‌లో (ఇలాంటే వూళ్ళని నాన్న చెప్పాడు) వాళ్ళందరూ పేద్ద దీపావళి చెయ్యాలని చూస్తున్నారుట – వాళ్లు అది చేస్తే ఇంక అంంంంంంంంంం ంంంంంధరూ బేద్ద పేద్ద టపాకాయలతో పేఎఎఎఏద్ద దీపావళి చేస్తారుట.

అది చేస్తే ఇంక టపాకాయ లుండవు. దీపావళులుకూడా అస్సలుండవుట.

అందికనేమో కావలిస్తే చిన్న చిన్న దీపావళీలు ఏడాదికి రెండో, ఫదో చేసుకుని అంధరూ హాయిగా ఉండండీ – అంత పెద్దదివొద్దూ.......బుల్లి బుల్లి టపాకాయలైతే చాలారోజులొస్తాయి...... పెద్దవొద్దూ......

అమ్మబాబోయ్ ప్రెవేటు మేష్టరు.......తలుపేసేయ్.....ఏవండీ! మా బుడుగుకి పాపం, జెరవండీ..... కుర్రవెదవ ......ఇవాళ ప్రెవేటొద్దు లెండి.......నెనే నాండి......నేను మా నాన్నని.........

# చదూ సంజెలు ఖద

చదూసంజెలంటే – ఇప్పుడు మీ బాబాయి ఉన్నాడా, వాడి దగ్గర ఉండవు, అవన్నమాట.

దీన్నే బామ్మలు చదూసంజా అంటారు. నాన్నలేమో – అలాంటే గోపాళం అన్నమాట. ఏం. వాళ్ళెమో చదూ సంజె అంటారన్నమాట.

ఇవి మరి బాబాయి దగ్గర లేవుగదా? వాడి దగ్గర బుద్ది, డబ్బులుకూడా లేవుట.

కాని ఒకటో ఫదో అయిడియా లుంటాయి అయిడియాలంటే నాకు తెలీదు.

ఇంకానేమో కావెట్రులు, సిగరెట్టులు ఉంటాయి. కావెట్రులంటే అవి చూట్టానికి కాయితాలలా ఉంటాయన్న మాట.

సిగరెట్టులు తెల్లగా ఉంటాయి. అగరెత్తులు నల్లగా ఉంటాయి. అగరెత్తులు గోడ మీద గుచ్చి కాలుస్తారు. ఇవేమో నోట్లో గుచ్చి కాలుస్తారు.

ఇవి మొగాళ్లే కాలుస్తారుట. బామ్మ అగరెత్తులు కాలుస్తుంది.

రెండుజెళ్ళ సీతకూడా సిగరెట్టులు కాల్చదుట. అయినా బామ్మ రేపో ఇప్పుడో కూడా దాన్ని అరుగుమీంచి చూసి యిలా నవ్వేసింది గదా.

ఛూడూ, ఛూడూ మొగరాయుళ్లా ఎలా నడుస్తోందో అంది.

అప్పుడేమో నేను పరుగేరుకెళ్ళి సీతని అడిగానుగదా సీతా నువ్వు సిగరెత్తులు కాలుస్తావుగధా అని. హా అని అది హాచెరపడి పోయేసింది.

ఎవర్చెప్పార్రా అంది. మా బామ్మ చెప్పింది అన్నాను. అప్పుడేమో రెండు జెళ్ల సీత బాబాయికి రోడ్డుమీద ప్రెవేటు చెప్పేసింది ఖోపంగా.

ప్రెవేటు చెప్పడం అంటే కొట్టడం అన్నమాట. ఇలా మొట్టికాయ కొట్టి, చెవులు మెలిపెట్టి హన్న అంటారూ అది.



మంపడ్గిర చదూసంజెలు లాపోతే మష్టం!

పాపం నాకు చిన్నప్పుడు కుంచెం ఫదిమందో ఒక మందో ప్రెవేటు మేష్టర్లొచ్చారుగదా.

కాని బ్బయపడి పారిపోయారులే.

కొట్టకుండా తిట్టినా కూడా ప్రెవేటు చెప్పడమే ఏం. రెండు జెళ్ళ సీత బాబాయికి ప్రెవేటు చెప్పేసిందా.

మరేమో బాబాయి నాకు గుండుమీద కుంఛెం ప్రెవేటు చెప్పి పరిగేరుకుని బామ్మ దగ్గిరి కెళ్ళాడు. (బామ్మకి మడిగదా. అందికని దూరంగా ఉంది) గాఠిగా అరిచి ప్రెవేటు చెప్పేశాడు.

అప్పుడేమో బామ్మయ్యింకా గాఠిగా అరిచి వాడికి ప్రైవేటు చెప్పేసి తాతగారి కుర్చీ దగ్గిరికెళ్లి ఇలా ఏడిచేసింది.

అప్పుడేమో మా గోపాళంకూడా వచ్చి బాబాయికి ప్రైవేటు చెప్పేశాడు. చదూ సంజెల్లేవా అలానేసి ఖోప్పడేశాడు.

ఈ చదూసంజెలు లాకపోతే అస్సలు డేంజరుట. డేంజరంటే మనకి తెలీదు.

కాని యివి మందగ్గిర లాకపోతే మనికి – అంటే బాబాయికిలే – రెండు జెళ్ళ సీత నిచ్చి పెళ్ళి చెయ్యరన్నమాట.

కాని పెళ్ళికూడా డేంజెరేనుట. ఇలాని లావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడు చెప్పాడు. హాయిగా చదూసంజె లేకపోతే లావుపాటి పక్కింటి పిన్నిగారి నిచ్చి పెళ్ళి చెయ్యరుట.

అప్పుడేమో ఇంచక్కా జెటకాబండీయో, రైలింజనో తోలుకొని పోలీసు వాడిలా కూచుని పేపరు చదువుకోవచ్చుట. ఇలాని వాడు చెప్పాడు. వాడు చాలా మంచివాడు. నా కిష్టం కుంచెం గుండుంటుందనుకో.

మా నాన్న ఆఫీసులో విగ్గులేని ఎముడు లేడూ వాడికీ గుండుంటుంది. విగ్గులేని ఎముడంటే మేనేజరుట. ఇలాని మా నాన్న చెప్పాడు. మేనేజరంటే నాకు తెలీదు.

కాని వుర్రేయ్, నువ్వు సీ గాన పెసూనాంబని పెళ్ళి చేసుకోవాలనుకో. అప్పుడు మందగ్గిర చదూసంజెలు ఉండాలిట. లాపోతే పెళ్ళి చెయ్యరుట.

అనగనగా వో రాజు లేడూ? వాడి కొడుకు పాపం రాజకుమార్తిని ఫెళ్ళి చేసుకోవాలా?

అప్పుడు వాడు ఫదిమందో, నూరుమందో రాచ్చసులిని చంపాలిగదా ముందర. మనంకూడా అంతేనట –

కాని యిప్పుడు రాచ్చసులు అయిపోయారు. చంపడానికిలేరుట. అందుకని యిప్పుడేమో మనం పదమూడో ఎక్కం, సిబిపాటం ఇవన్నీ చదువుకోవాలిట. అవి వచ్చేస్తే రాచ్చసులు చచ్చిపోతారుట.

మనం బాగా చదూకుని ఫ్టది కాణీలో వంద కాణీలో తెచ్చినా రాచ్చసులు చచ్చిపోతారుట. లాపోతే సీగానపెసూనాంబ నిచ్చి పెళ్ళిచైరన్నమాట. ఇలాని మా రాద చెప్పింది. రాధంటే అమ్మలే.

అందికని వెదవది చదూసంజెలు మందగ్గిర లాకపోతే ఖష్టంట. అసలవి లాకపోతే పెళ్లి చెయర్ట.

పెళ్ళంటే సీగానపెసూనాంబ బండరావుడు, ఇంకానేమో వాళ్ళ సీత మనందరం ఆడుకోడం, పెళ్ళేకాదు జీవితం కూడా ఖష్టంట ఇవి లేపోతే.

జీవితం అంటే నాకు తెలీదు. ఇలాని బాబాయి అంటాడు. రెండుజెళ్ళ సీత నవ్వకపోతే.

ఏం, పదమూడో ఎక్కం ఖద చెప్పనా.

అనగనగనగనగనగన ఒకరోజున........

ఏం, ఖద చెప్పేస్తా నంతే, అనగనగనగనగనగా ఒకరోజున...............


రాచ్చసుడూ-
పదమూడోపెక్కం
ఖద...


బురుసా బురుసా! చూశావా- మరేమో నేనూ వాళ్లనేతా ఆటుకుంటే నేమో మరేమో వాళ్ల పెద్దన్నయ్యా వచ్చి దన్ని లాక్కెళ్లిపోయి- నన్నుతో అనీ.....


ఏడవకురా గోపీ- నేను రేపొ ఘదిరోలుకో యిలా పెద్దవాణ్ణయిపోతానా- అప్పుడు వాడి నడ్డిమీద భంపేదాం - ఏం?
నేనూ-ఇప్పుడే పెద్దవాడి వయిపోయి కొత్తేదం


ఒద్దమ్మా- నేను పెద్దవాణ్ణయ్యేలోగా నీకో ఖద చెప్పనా! - అనగనగన గనగనగనగనగనగనగన.....


గనగనవద్దూ
ఖద చెప్పు


సరి సరి- అనగనగా ఓరాజు- ఆరాజుకేమో చాక్షని కోడుకు- నీలాగా అరుస్తూ య్యెంతో ముద్దొస్తాడు-


చక్కెగిరజాల జుట్టుతో - పెద్ద ఖత్తి పట్టుకుని- అంటే ఖత్తి జుట్టుతో కాదు- చేత్తో పట్టుకుని- స్సింహాల్నీ పులుల్నీ- య్యేనుగుల్నీ భంపేసేవాడు

ఆ రాజుగారింటికి ఎదురుకుండా ఇంకో
కృష్ణంరాజుగారుండేవారు. ఆయనకి ఓ
కూతురు - ఇంచక్క గానపెసూనంబంత
బంటుంది

వాళ్లిద్దరూ రోజూ ఇంచక్క ఆడుకునేవారు
వాళ్లమ్మ బెల్లపుజీళ్లు చేసేదిలా
మనమరాలూ బోర్లుపెట్టేది - రాజు
గారింటో పెద్దగది నిండా జీళ్లు - ఇంకో
గది నిండా జంగిరీలూ వుంటాయి గదా

ముంతెలు బండీలూ?
మూడు చెక్కరాల సైకిళ్లు?
ఓ! అవికూడా
స్వదోయాబయె
వుంటాయి. ఇంకా
తాటకు బొమ్మలూ
రిబ్బన్లూ - రెజీలూ
అయిసుక్రీము - బటానీలూ - గోపిగొళ్లు..

ఖడ చె....
సర్లే సర్లే - ఆ రోజున
యువరాణీ యువరాజూ
ఆడుకుంటూ వుండగా
ఏమైందంటే...

దాగుడుమూతలాటలో యువరాజు
కళ్లుమూసుకుని వుండగా
ఓ పెద్దరాక్షసుడు
ఇలా వచ్చేశాడు

వచ్చేసి యువరాణిని ఎత్తుకు
పారిపోయి - వాడి కోటలో
దాచేశాడు - యువరాజు కళ్లు
తెరిచేసరికి రాణి ఏదీ? లేదు!

'యమ్మో' అని ఏడుద్దామని అనుకునేలోగా
ఓ పేదరాసి పెద్దమ్మ వచ్చి 'ఎందుకు
ఏడుద్దామనుకుంటున్నావు అబ్బాయీ?
అని అడిగింది - వాడు చెప్పాడు

మీ సీత నాకు తెలుసు - రాక్షసుడి
కోటలో ఏడుస్తోంది అంది పెద్దమ్మ
మరియలాగా అని ఏడిచేశాడు రాజు

బయపడకు-నేను నీకు కీలుగుర్రం ఇస్తానూ-అందుమీద వెళ్లి రాక్షసుణ్ణి చంపేసి సీతని తెచ్చుకో-హ్రాం హ్రాం హ్రాం అంది పెద్దమ్మ



అప్పుడేమో యువరాజు ఆ కీలుగుర్రం ఎక్కి 'జై కీలుగుర్రం-రాక్షసుడింటికి పదా' అనేసరికి అదేమో ఇలా జుంమని ఎగిరిపోయింది



రాక్షసుడి ఇంటిదగ్గిర వీధిలో ఇంకో చిన్న రాక్షసుడున్నాడు.







యువరాజు ఇంటికెళ్ళి-అమ్మనడిగి ఆ పద్యం ఘుబుక్కున నేర్చేసుకుని పరిగెత్తుకొచ్చి రాక్షసుడికి అప్పచెప్పాడు. వాడు సరే అని లోపలికి వదిలాడు



లోపల ఇంకో రాక్షసుడున్నాడు

ఒరేయ్-నీకు శిబిచక్రవర్తి పాఠం వచ్చిందిరా? ఆళ్వారులగానెవరు?







యువరాజు పరిగెత్తుకొచ్చి శిబి పాఠం ఆళ్వారుల పాఠం-చదివేసి మళ్లీ వచ్చేసి అప్పచెప్పేశాడు-చివరస్త్రంగా విప్లవం కవి వాడిది ఓ పద్యం చదివేసరికి వాడు బయపడిపోయాడు. యువరాజు వాడిమీది ఇలా నడిచి లోపలికెళ్లాడు




లోపల ఇంకో పెద్దరాచ్ఛసుడున్నాడు
వాడు సీతకి ప్రైవేటు చెప్పిస్తున్నాడు


ఓరే రాచ్ఛసా - మా సీతని
వదిలెయ్యి - లేపోతే ఈ
కత్తితో నీ నెత్తిమీద భంపేస్తా


అప్పుడా రాచ్ఛసుడు ఓటుకి వచ్చిన
మంతిరిలా ఇలా
గాఠిగా నవ్వేడు


వురేయ్ నీకు పదమూడో ఎక్కం వచ్చురా!
నాకు రాదే! - మా
బాబాయికొక్కడే రాదని
నా అవమానం
నాకూ రాదు


అయితే నా
సీతన్నివ్వను
పో


అప్పుడు యువరాజు పరుగెత్తుకెళ్లి
వీధిలోని వాళ్ల బాబాయినడిగాడు
ఎక్కం లేదూ పిక్కం లేదూ
బిజీగా వున్నా - పో


అప్పుడు పక్కింటి పిన్నిగారి మనవడూ
పకోడీల నరయ్యగాడూ ఏవరని పెద్దమ్మ
ఆఖరికి వెళ్ళమన్నక్కూడా తెలీదుట!
చివరికి వాళ్ళనాన్న ఎక్కాల బుక్కు తీసి
గబగబా చెప్పేశాడు


వెంటనే ఖంగుతో పట్టేసి రాక్షసుడి
దగ్గరకెళ్ళి ఆలవాయింపుగా - పదమూడొక్క
పదమూడూ - పదమూడు పదుల నాలు
ముప్పై అని గబగబా
అప్పచెప్పేశాడు


అప్పుడు రాక్షసుడు హాఁ అని అరిచి
కిందపడి చచ్చిపోయాడు
రాజు సీతని రక్షించాడు
జై!


అయితే బుడుగా - నాకు అర్జంటుగా
పదమూడో ఎక్కం నేర్పేయ్ - నే వెళ్ళి
సీతని రక్షిస్తాను


అలా నేర్పకూడదమ్మా గోపీ - మీ ఇంటి
కెళ్ళి ఎక్కాల బుక్కు తీసుకురా - అది
చూసి, మంత్రం వేసి చెప్తావి - ఎక్కాల
బుక్కు చూసి చెప్పకపోతే వేళ్ళకి
కోపం వస్తుంది


వరేయ్ - ఊపుచదివేవాడూ -
ఊపుచదివేవాడూ!
ఆ గోపిగాడొస్తే
నేను తేనా -
ఇప్పుడిప్పుడే రామా
తెలుగు సినిమాకి
వెళ్ళిపోయామా
అని చెప్పరా - ఏం?
అయిపోయింది



మేం అందరం రేపో మూ్రాడోలుకో కుతో తీంచుకున్నాంగదా. ఇందులో ముందర ఉన్న బొమ్మ నేను. నేను అందరికన్న చిన్నవాడిలా ఉన్నాను కాని, సీగానపెసూనాంబకన్న పెద్దవాడినిగదా. యేం. అందరికన్నా సీగానపెసూనాంబా, నా కన్నా, మా నాన్నకన్నా అమ్మే ఛాలా బావుంది. అమ్మ ఛాలా మంఛిది కూడా. తరవాత నాన్న ఛాలా మంచివాడు. నేను బంగారుతండ్రీ అంటారు వాళ్లు. బామ్మ కూడా ఒక్కోసారి అంటుందనుకో. బామ్మంటే నావెనకాల కూచుందీ అదన్నమాట. బామ్మముందర సీగానపెసూనాంబా, నేను. బామ్మ పక్కన లావుపాటి పక్కింటి పిన్నిగారు ముగుడు. వెనఖ్ఖాల బాబాయి నించున్నాడుగదా. యేం. ఈ ఛివ్వర ఓటి లేదూ. అదే లావుపాటి పక్కింటి పిన్నిగారు. ఛాలా లావుగదా. అందికనే కుతోలో లావుపాటి పిన్నిగారు అంతా లేదు. కుంచెం ఉంది. ఇంకా ఛాలా బోల్డు పిన్నిగారు కుతో చివర అవతల (మనికి కనబడదులే) ఉందన్నమాట. పిన్నిగారు ఇందులో పడితే వెనకాల బాబాయి తలకాయ ఎగిరిపోతుందని కుతోవాడు చెప్పాడు. వాడు ఛాలా పొడుగుకదా. మరేమో పిన్నిగారు ఛాలా లావు. నా తలకాయలేకపోతే కొరేస్తాను అని కుతోవాడికి ప్రైవేటు చెప్పేశాడు బాబాయి. అందుకని బోల్డు బాబాయిని ఉంచి కుంచెం లావుపాటి పిన్నిగారిని తీసేశాడు కుతోవాడు. అదీ సంగతి.





# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం - 3

## బాలరమణీయం



